# ...పెక్టర్ జనరల్

[ హాస్యపూరిత వ్యంగ్యనాటకం ]



రెంటాల గోపాలకృష్ణ



విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ



# మాతృక:

ప్రఖ్యాత రష్యన్ నాటక కర్త

గోగొల్ రచన

ఈ నాటకానికి ఆధారము.



4

# నాటకంలో వచ్చే పాత్రలు

చైనులు : తాలూకా ప్రధానోద్యోగి

వసంతకుమార్ : ఢిల్లీ ప్రభుత్వ కార్యాలయంలో పని చేస్తున్న చిన్న గుమాస్తా

పానకాలునాయుడు : సబ్ మాజిస్ట్రేటు

కైలాసరావు : డాక్టరు

హయగ్రీవఅయ్యవార్లు : హైస్కూలు హెడ్మాస్టరు

కాంతయ్య : పోస్టుమాస్టరు

పరాంకుశం : సబ్ ఇన్‌స్పెక్టరు

మిరియాలు, ధనియాలు } ఊళ్ళో షావుకార్లు

భూషయ్య, శేషయ్య } ఊళ్ళో వర్తకప్రముఖులు

చక్రపాణి : వసంతకుమార్ స్నేహితుడు, సేవకుడు

హోటల్లో వెయిటరు

సుబ్బన్న : చైనులు ఇంట్లో నౌకరు

కాన్‌స్టేబులు

బిళ్ళబంట్రోతు : ప్రభుత్వ కార్యాలయం నుంచి వచ్చిన సేవకుడు

కోమలమ్మ : చైనులు భార్య

తిలకమ్మ : చైనులు కూతురు

గమనిక : ఇందులో వెయిటరు, సుబ్బన్న, బిళ్ళబంట్రోతు, పాత్రలు ఒకే వ్యక్తి ధరించవచ్చును. కాన్‌స్టేబుళ్ళు ఇద్దరుంటే మంచిది. లేకపోతే ఒకరితో సర్దుకోవచ్చును

---

ఈ నాటకం ప్రప్రథమముగా ఆంధ్ర ఆర్ట్స థియేటరు
(వె॥ హ॥ గ్రంథాలయ వైజ్ఞానిక శాఖ) వారిచే
11-2-56 న విజయవాడలోను, వెంటనే 13-2-56 న రాజమండ్రిలో
జరిగిన విశాలాంధ్ర సాంస్కృతిక మహాసభలోనూ,
విజయవంతంగా ప్రదర్శించబడింది.
ఆ ప్రదర్శనలలో పాల్గొన్న నటీ నటులు.

| | | |
|---|---|---|
| చైనులు | : | శ్రీ కొడాలి ఆదిశేషయ్య |
| వసంతకుమార్ | : | శ్రీ నందూరి మురళి |
| పానకాలునాయుడు | : | శ్రీ యం. వి. సత్యనారాయణ |
| హయగ్రీవం | : | శ్రీ డాక్టర్ వీరయ్య |
| చక్రపాణి | : | శ్రీ చలపతిరావు |
| మిరియాలు | : | శ్రీ వి. సూర్యనారాయణ |
| ధనియాలు | : | శ్రీ వై. హరినారాయణ |
| కైలాసరావు | : | శ్రీ సత్యబాబు |
| కాంతయ్య | : | శ్రీ నందూరి సుబ్బారావు |
| పరాంకుశం | : | శ్రీ యస్. వెంకటేశ్వరరావు |
| భూషయ్య | : | శ్రీ డి. బిల్హణశాస్త్రి |
| శేషయ్య | : | శ్రీ వెంకట్రావు |
| వెయిటరు, సుబ్బన్న | : | శ్రీ ప్రసాదరావు |
| బిళ్ళబంట్రోతు | : | శ్రీ జి. వి. యస్. శాస్త్రి |
| ఒకటో కానిస్టేబులు | : | శ్రీ అప్పలస్వామి |
| రెండో కానిస్టేబులు | : | శ్రీ గోపాలరావు |
| కోమలమ్మ | : | శ్రీమతి జి. నిర్మల |
| తిలకమ్మ | : | శ్రీమతి ఆర్. ఉషాబాల |
| సెట్స్ | : | ఆంధ్ర ఆర్ట్స థియేటరు, విజయవాడ |
| మేకప్ | : | శ్రీ రామచంద్రరావు |

ఈ నాటక ప్రదర్శనలో ఎంతో శ్రమించి నాతో సహకరించి నాటకాన్ని జయప్రదం చేసిన ఆంధ్ర ఆర్ట్స థియేటరు సభ్యులకు నా కృతజ్ఞత.

— రెంటాల

# కొన్ని ముఖ్యపాత్రల వివరణ

చైనులు : తాలూకా ప్రధాన ప్రభుత్వోద్యోగి. వయస్సు సుమారు 45. ఉద్యోగంలో ఢక్కా-ముక్కీలు తిన్నవాడు. అన్ని విషయాల్లోనూ తను తెలివైనవాణ్ణని అనుకుంటూ వుంటాడు. కాని ఒక్కోసారి అకస్మాత్తుగా చిన్నవిషయాల్లోనే పప్పులో కాలువేసి బాధపడుతూ వుంటాడు. అనేక సంవత్సరాలబట్టీ పుష్కలంగా లంచాలు పుచ్చుకుంటున్నా పైకి ఒక గొప్ప ప్రజాసేవకుడికిమల్లే పోజుపెట్టి, అందుకు తగినట్లు హుందాగా ప్రవర్తిస్తుంటాడు. సీరియస్‌గాను, గంభీరంగాను వుంటాడు. క్రిందిఉద్యోగులమీద పెత్తనంచేయడంలో మొనగాడు. ఇతను మాట్లాడే ప్రతిమాట ఏదో అర్థవంతంగాను భావగర్భితంగాను వుండి ఏదో ఒక ముఖ్యవిషయాన్ని ముందుగా సూచిస్తూవుంటుంది. మొహంమీద అతి దృఢంగా, ముద్దుగా, హెచ్చుతగ్గులుగా ముడతలు కన్పిస్తుంటాయి. నిముషంలో భయంలోంచి సంతోషంలోకి దిగిపోతాడు. అలాగే గర్వం, అహంకారంలోంచి మారిపోయి అతివినయం, నమ్రతచూపిస్తాడు. విచిత్రమైన ప్రకృతి, వెనుకటి కాలపు పద్ధతిలో పంచె, చొక్కా, కోటు, తలగుడ్డ, చెప్పులు చేతికర్ర ధరిస్తాడు. జుట్టు అక్కడక్కడ నెరిసివుంటుంది.

వసంత్‌కుమార్ : ప్రధానమైన పాత్ర. వయస్సు సుమారు 23. మంచి అందగాడు. చలాకీగావుంటాడు. చమత్కారంగా మాట్లాడతాడు. చంచలమైన బుద్ధి. ఢిల్లీలో ప్రభుత్వ కార్యాలయంలో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. ఎక్కువమంది యువకులకుమల్లేనే ఇతనూ తన భావి జీవితాన్నిగురించి ఎన్నెన్నో తీయని కలలు కంటూ, గాలిమేడలు కడుతుంటాడు. దేశాలు

తిరగడమంటే సరదా. జూదానికీ, పానానికీ, విలాసాలకూ, వినోదాలకూ డబ్బు వెచ్చిస్తూంటాడు. స్వతహాగా మనిషి అమాయకుడు. ఏ విషయాన్ని అయినా ముందుగా ఆలోచించి పెద్ద ప్లానులు వేయలేడు. కాని, ఏదైనా అవకాశంవస్తేమాత్రం చాకచక్యంతో ఉపయోగించుకోగలడు. ఎంత నిష్కపటంగా, సరళంగా, అమాయకంగా, బేలగా, వెర్రిబాగులతనంగా నటిస్తే అంతబాగా ఈ పాత్ర రక్తి కడుతుంది. విజయవంతమవుతుంది. కాలానికి తగిన ఫాషన్‌లో వివిధ రకాల దుస్తులు ధరిస్తాడు.

చక్రపాణి : వసంతకుమార్‌కు స్నేహితుడు. అతని సేవకుడిగా కూడా ఉపయోగపడుతూ, అతని అండన పడివుంటాడు. యజమానికంటె ఇతనే తెలివైనవాడు. ఏవిషయాన్ని అయినా అతనికంటె ముందుగా గ్రహించి, అతనికి ఉపాయాలు చెపుతూ, సలహాలిస్తూ కార్యం సాధించేలా చేస్తాడు.

మిరియాలు, ధనియాలు : ఊళ్ళో పుకార్లు లేవదీస్తూ ఊరంతా ఒక కొలిక్కి తెస్తుంటారు. ఎక్కడెక్కడి విషయాలు వాగుతూ గోరంతలు కొండంతలు చేస్తుంటారు. చైనులు చేతికింద పడుండి అతని మెప్పుకోసం నానాయాతనలు పడుతుంటారు. ఇద్దరూ పొట్టివాళ్ళే. కాకపోతే మిరియాలు కాస్తసన్నగా, పొడుగ్గా వుంటాడు. మూర్ఖులు, చపలచిత్తులు. కాస్త హెచ్చుతగ్గుగా ఇద్దరూ సమవయస్కుల్లా అగుపిస్తారు. మిరియాలు కొంచెం సీరియస్‌టైప్.

కోమలమ్మ : చైనులుభార్య. వయ్యారంగా కులుకుతూ పలుకుతూ వుంటుంది. కళ్ళకు జోడుపెట్టుకుంటుంది. పట్టణాల్లో వుండే ఎక్కువమంది నవనాగరికత స్త్రీలకుమల్లే, పెద్దఉద్యోగస్థుల భార్యలకుమల్లే ప్రవర్తిస్తూ వుంటుంది. కొంచెం గయ్యాళిమనిషి. భర్తమీద పెత్తనంచేస్తూ, అతన్ని డామినేట్ చేస్తూవుంటుంది. తరుముతూ తొందర తొందరగా మాట్లాడుతూ వుంటుంది.

షోకులకింద కొంత, నవలలు, నాటకాలు చదవడంకింద కొంత కాలం వ్యయంచేస్తూ వుంటుంది. తక్కిన సమయాల్లో ఇంటి పనుల్లో మునిగి తేలుతూ నౌకర్ల మీద అధికారం చెలాయిస్తూ తీరుబడిలేని మనిషిలా కనిపిస్తూ వుంటుంది, సభలకూ, సమావేశాలకూ, లేడీస్ క్లబ్బులకూ హాజరవుతూ వుంటుంది. ఉద్యోగస్థుడి భార్యననీ, ఊళ్ళో సాటివారిలో తనకొక గౌరవం రావాలనీ తాపత్రయపడుతూ వుంటుంది. వయస్సు సుమారు 35; నాటకం మొత్తంమీద 4 సార్లు దుస్తులు మారుస్తుంది.

తిలకమ్మ: చైనులుకూతురు. వయస్సు సుమారు 18 వెర్రిబాగుల పిల్ల. ఒక్కొక్కసారి తల్లిని కూడా పెద్ద, చిన్న తెలియక మాట్లాడుతుంది. అందుకే ఈపిల్ల ఏమాట చెప్పబోయినా తల్లి నోరుమూయిస్తూవుంటుంది.

తక్కిన పాత్రలన్నీ సరీగా అర్థంచేసుకుని ఆయాసందర్భాల కనుగుణ్యంగా నటిస్తే జయప్రదమవుతాయి.



# ౧

## ఒకటో రంగము

[అన్నివిధాల వెనుకపడివున్న ప్రాంతంలో ఒక ఊరు. అంతచిన్న ఊరూ కాదు, పెద్ద పట్నమూ కాదు. అది తాలూకాకు కేంద్రము. రాజధానికి దూరం గాను, రాష్ట్రంలో మారుమూలను వుండడంవల్ల రాకపోకలకు కూడా అంత అను కూలంగా లేదు. అక్కడి ప్రజలు అమాయకులు. అవిద్య అజ్ఞానం ప్రబలంగా వుంది. ఆ ఊరిని ప్రభుత్వాధికార్లే పరిపాలిస్తున్నారు. తాలూకా ప్రధాన ప్రభుత్వోద్యోగి చైనులు. స్థానిక అధికార్లంతా ఆయన చేతకింద పనుంటారు. ఆ ఊళ్ళో ఒక హైస్కూలు, ఒక ఆసుపత్రి, సబ్‌మాజిస్ట్రేటుకోర్టు, మరికొన్ని ధర్మసంస్థలు వున్నాయి.

తెర తీసేసరికి చైనులుగారి బంగళాలో ముందుగది కన్పిస్తుంది. గోడకు అంద మైన ఫోటోలు, వెంకటేశ్వరస్వామి పటము వుంటాయి. గది విశాలంగావుంటుంది. సోఫాలు, కుర్చీలు మొదలైనవి వుంటాయి. ఎదురుగా ఆఫీసుగది కన్పిస్తుంటుంది. గోడకొక కిటికీ వుంటుంది. కిటికీలోంచిచూస్తే వీధిలోవాళ్లు అగుపిస్తారు.

అది ఉదయం 8 గంటల సమయం. మాజిస్ట్రేటు పానకాలు నాయుడు, డాక్టరు కైలాసరావు, హైస్కూలు హెడ్మాస్టరు హయగ్రీవ అయ్యవార్లు స్టేజి మీద కనిపిస్తారు. పానకాలునాయుడు, గోడకున్న ఫోటోలు పరిశీలిస్తుంటాడు. కైలాసరావు కిటికీవద్ద నిలబడి గాలిపీల్చుకుంటూ వుంటాడు. ఆయనకు కొంచెం ఎడంగా కుర్చీలో హయగ్రీవం కూర్చుని వుంటాడు. ఆ ముగ్గురూ చైనులుగారి రాకకోసం వేచివున్నారు. వాళ్ళ మొహాల్లో ఆతృత కనిపిస్తూ వుంటుంది. ఇంతలో చైనులు లోపల్నుంచి ప్రవేశిస్తాడు. ఆయన్ను చూడగానే ఆ ముగ్గురూ అటెంటివ్‌గా నిలబడి విష్ చేస్తారు.]

అందరు : [ఒకేసారి] గుడ్ మార్నింగ్.

చైనులు : [సీరియస్‌గా] గుడ్ మార్నింగ్ కాదు. Very bad మార్నింగ్. మిమ్మల్ని ఇప్పుడెందుకు పిలిపించానో తెలుసా ?

అందరు : [వినయంగా] అయ్యా !

చైనులు: పక్కమీదినుంచి లేవగానే ఒక పిడుగువంటి వార్త వినవలసి వచ్చింది. ఈ వార్త మీ చెవిన వేయవలసి వచ్చినందుకు నాకెంతో చింతగా వుంది. అయినా తప్పదు. మన రాజధాని నగరంనుంచి ఒక పెద్ద ఆఫీసరొస్తున్నాడు. ఊరికె రావడంలేదు. రహస్య ఆజ్ఞలతో వస్తున్నాడు. మన రాష్ట్రాన్ని తనిఖీ చేయడానికొస్తున్నాడు. అందులో ముఖ్యంగా మన జిల్లాకు. ముందు మన ఊళ్ళోనే మకాం చేస్తాడు. అంతేకాదు. మరో విషయం. అతను మారువేషంలో వస్తాడు.

పాన: ఏమన్నారూ! రాజధానినగరంనుంచా?

కైలాస: రహస్య ఆజ్ఞలతోనా?

హాయ: మారువేషంలోనా?

చైనులు: ఇవాళ ఏదో ముంచుకొస్తుందని నాకు ముందుగానే తెలుసు. దాని సూచన అప్పుడే కనపడింది. రాత్రి నాకో పీడ కల వచ్చింది. పర్వతాకారాల్లాంటి ఇద్దరు రాక్షసులు నామీద విరుచుకపడ్డారు. అలాంటివాళ్ళను నా జన్మలో చూళ్ళేదు. నా గుండెలమీద ఎక్కి తొక్కారు. నేను పెద్దగా కేకపెట్టానట. మా ఆవిడ నన్ను లేపి నాచేత ఆంజనేయదండకం చదివించి నన్ను నిద్రపుచ్చింది.

పాన: రావణాసురుడై వుంటాడు.

చైనులు: ఒకరుకాదయ్యా, ఇద్దరు. అన్నదమ్ముల్లా వున్నారు.

పాన: అయితే రావణ, కుంభకర్ణులే. సందేహంలేదు.

హాయ: No, No. రావణుడైతే పది తలలుండాలి. వాళ్ళు బక హిడింబాసురులు.

కైలాస: కాదు. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు.

హాయ: కాదు. బకహిడింబాసురులు. కావాలంటే రుజువుచేస్తాను.

చైనులు: [హాయగ్రీవంతో] హాయగ్రీవ అయ్యవార్లంగారూ! ఇహ ఆపండి మీ రామాయణం.

హాయ : రామాయణంకాదండీ, భారతం.

కైలాస : భారతంకాదు, భాగవతం.

పాన : భాగవతంకాదండీ రామాయణమే.

చైనులు : ఇష్! ఏమైతేనేమయ్యా! ఇప్పుడు మీకో ఉత్తరం చదవబోతున్నాను. అది మా బావమరిది వ్రాసింది.

పాన : బ్రహ్మయ్యశాస్త్రి?

హాయ : పార్లమెంటు మెంబరు?

కైలాస : ఢిల్లీనుంచి?

చైనులు : అవును. బ్రహ్మయ్యశాస్త్రి, పార్లమెంటు మెంబరు. మీ అందరికీ తెలుసుగా? ఏం వ్రాశాడంటే—పూజ్యులు, గురుపాదులు, త్యాగధురంధరులు, దేశసేవకులు అయిన బ్రహ్మశ్రీ [ఉత్తరం లేకుండానే ఉన్నట్లు చదివి తరువాత జేబులు వెదుకుతుంటాడు. జేబులోంచి ఉత్తరం తీస్తాడు.] బ్రహ్మశ్రీ చిదానంద చైనులుబావగారి దివ్యసముఖమునకు—మీ బావమరిది బ్రహ్మయ్యశాస్త్రి, పార్లమెంటు మెంబరు అనేక సహస్రాభి వందనములు చేసి వ్రాయునది. [అసలువిషయం ఉత్తరంలో ఎక్కడుందా అని వెతుకుతాడు] ఆ, ఇది. [తిరిగి చదువుతూ] అర్జంటుగా మీకు ఉత్తరం వ్రాయవలసి వచ్చింది. మన రాజధాని నగరంనుంచి, మనరాష్ట్రాన్ని, ముఖ్యంగా మన జిల్లాను తనిఖీచేయడానికి ఒక ఆఫీసరు వస్తున్నాడని ఇందుమూలముగా మీకు హెచ్చరిక చేస్తున్నాను. ఈ ఆఫీసరు ఇన్‌స్పెక్టర్ జనరల్‌లాంటివాడు. సర్వాధికారాలు ఇతనికి వుంటాయి. ఈ విషయం నాకు అతి విశ్వసనీయ వర్గాలద్వారా తెలిసింది. అతను ఆఫీసరైనప్పటికీ మామూలుదుస్తులే ధరిస్తాడు. సాధారణ వ్యక్తిలాగే సంచరిస్తాడు. మీరూ నావంటివాళ్ళేనని నాకు తెలుసు. మనమంతా ఒకబళ్ళోనే చదువుకున్నాం. చేతికి చిక్కిందాన్ని జారవిడిచే రకంకాదు మనది. [చదవటం ఆపి అటూ ఇటూ చూస్తూ] ఇక్కడంతా మనవాళ్ళేగా? [మళ్ళీ ఉత్తరం చదువు

తాడు] ఈ పరిస్థితుల్లో మీరు గంగలో జాగ్రత్తగా వుండాలి. లేక పోతే ప్రమాదం తప్పదు. అతను ఏ క్షణంలోనైనా రావచ్చు. అసలీపాటికి వచ్చే ఉన్నాడేమో!......ఇ॥ స॥ మా అక్కగారు పంపిన దంపడుసురమగాలు, అటుకులు, వేరుశనక్కాయలు అందినవి. [చదవడం ఆపి] ఇహ మిగతాదంతా మా కుటుంబ వ్యవహారం. విన్నారా? అదీ విషయం!

పాన: ఏమిటీ అవాంతరం?

హాయ: తలవని తలంపుగా ముంచుకొచ్చిందే?

కైలాస: చాల చిత్రంగా వుందే?

హాయ: ఏమండీ చైనులుగారూ? అసలిదంతా ఎందుకు జరుగు తున్నట్టంటారు? ఎక్కడో దూరంగా రెండోకంట పడకుండా ఈ పడమటి సీమన పడున్నాంకదా! ఉన్నట్లుండి మన మీదికి ఈ ఆఫీసరు దండయాత్ర ఏమిటి?

చైనులు: ఏమిటా? మన ఖర్మయ్యా! కర్మ! అయ్యవార్లంగారూ! ఇంకా మన గీత మంచిదనుకోండి. ఇదివరకే ఆఫీసర్లొచ్చి అన్ని పట్టణాలు చుట్టిపెట్టారు. అధికార్లను హడలగొట్టారు. ఇంత కాలం మనం తప్పించుకు తిరిగాం. ఇప్పుడు మన టరన్ వచ్చింది. నిలబడొద్దూ మరి?

పాన: చైనులుగారూ! నేనొకటనుకుంటున్నాను. దీనికో బలమైన రాజకీయకారణ వుండి తీరాలి. మళ్ళీ ఎలెక్షన్లకోసం పంపు తున్నారేమో?

చైనులు: మొన్ననేకదటయ్యా ఎలెక్షన్లు ముగిసింది! నెలకోసారి ఎలెక్షన్లు జరుపుతారా ఏమిటి? ఆమాత్రం బుర్ర లేదటయ్యా నీకు? పెద్ద తెలివిగలవాడినంటావే! ఇంతేనా నీ తెలివి?

కైలాస: అదికాదండీ! గవర్నరుగారి నిధి అంటూ ఈ మధ్య ఏర్పాటు చేశారుగా? ఫండు కలెక్టుచేయడానికి పంపిస్తున్నారేమో?

చైనులు: ఎలెక్షన్లకోసం వస్తున్నాడో, కలెక్షన్లకోసం వస్తున్నాడో ఇప్పుడనవసరం. ఎలాగైతేనేం ఆఫీసరొచ్చి మన పీ·లమీద కూర్చున్నాడు ఇప్పటికే మన బండారం బయటపడిందేమో? నేనా? ఊరికే బాధ్యతగల అధికారిని. ఇప్పటికే కొంత పని ప్రారంభించాను. నగరాలంకరణకూ, పోలీసుబ దోబస్తుకూ తగు ఏర్పాట్లు చేశాను. పురవీథుల్లో పందిళ్లు వేయించి పచ్చటి తోరణాలు కట్టిస్తున్నాను. ఇంకా పకడ్‌బందీ చేయాలి. మీరూ మీ మీ బాధ్యతలు నిర్వర్తించాలి. అందులో ముఖ్యంగా నీవు! [కైలాసరావును చూపుతూ] ఇదుగో! కైలాసరావు! ఆఫీసరు నీ ఆసుపత్రికి తప్పకుండా వస్తాడు. ఆస్పత్రి అంతా అట్లాగే వుంచావా అంటే చేతులకు బేడీలు తప్పవు ఆ చెత్తంతా క్లీన్ చేయించి హాస్పిటల్‌ను అద్దంలా వుంచు. ఆ రోగులెప్పుడూ ఏడుపు మొహాలతో వుంటారు. ఆఫీసరు వచ్చినప్పుడైనా కాస్త నవ్వుతూ వుండమను. ఆ బీరువాలనిండా ఖాళీసీసాలుతప్ప మరేం కనపడవు కాస్త మందులు తెప్పించి సీసాలు నిండుగా వుంచు. మందులన్నీ అమ్ముకుంటున్నావనీ, రంగునీళ్లు పోస్తున్నావనీ ఇప్పటికే గోలగావుంది. మందు లేనందువల్ల నే రోజుకు అంతమంది రోగులు చస్తున్నారు.

కైలాస: [కొంచెం ఇరిటేట్ అయి] Absurd! మందులు నేనెప్పుడమ్ముకున్నాను? ఇదుగో, మొన్న మా అమ్మాయి పెళ్ళికి కాస్త డబ్బు తక్కువైతే ఒక పార్సెలు పెన్సిలిన్ ఇంజక్షన్లు అమ్మాను. ఇహ రోగులు చావడానికి నేనా కారణం? అసలు చచ్చిన తరువాతనే వాళ్లు నాదగ్గరికొస్తారు.

చైనులు: నీ అసిస్టెంటు ఆడనర్సులతో ప్రేమకలాపాలు సాగిస్తున్నాడు. ఆ కాంపౌండరు మందులిచ్చిన పాపానపోడు. బీడీలు దమ్ముకొడుతూ ఆ బోడెమ్మతో రొమాన్సు చేస్తాడేమయ్యా?

కైలాస: ఏంచేయమంటారు.....?

చైనులు: రోగుల్ని రోగాలవారీగా విభజించు. పైగా వాళ్ళు డాక్టరు లేనప్పుడు చుట్టలు కాలుస్తున్నారు. ఒకసారి నే రాగానే వాసనకూడా కొట్టింది. ఆస్పత్రినిండా అన్ని బెడ్లెందుకు? అది చూస్తే డాక్టరుకు వైద్యం రాదనుకుంటాడు ఆఫీసరు. పది మంచాలు లాగేస్తే పసందుగా వుంటుంది.

కైలాస: ఇవాళోరేపో అరడజనుమంది చెల్లుకుంటారు లెండి. కొన ఊపిరిలో కొట్టుకుంటున్నారు. అదీగాక మా ఉద్దేశ్యంలో మందులకంటె మంచితనంవల్లనే రోగాలు కుదురుతాయండీ.

చైనులు: [పానకాలుతో] ఇదిగో పానకాలు నాయుడూ! మీ కోర్టు వ్యవహారాలు మరీ అధ్వాన్నంగా వున్నాయి. కోర్టంతా కోళ్ళ మయమై పోయింది. ఆ బంట్రోతులైనా వాటిని అదిలించరే! అవి అక్కడే గుడ్లుపెట్టి పిల్లలుచేసి కాపురం వుంటున్నాయి. కోళ్ళ పెంపకం మంచిదే అనుకో. కాని మరీ గోలగా వుంటే ఎల్లా? మనుషులు రావడమే ఆలస్యం. కాళ్ళల్లోంచి దూరి పోతుంటాయి. ఒక్కొక్కసారి ప్లీడర్ల తలలమీదనుంచి ఎగిరి కుర్చీల్లో కూచుంటాయి. బల్లనిండా కోళ్ళ బొచ్చు. కోర్టంతా కోళ్ళ కంపు.

పాన: అదెంతపనిలెండి. ఇవాళ వాటన్నిటినీ చంపేసి పలావు చేయిస్తాను. రాత్రికి డిన్నరుకు రారూ?

చైనులు: అదీకాక మీ ఇంట్లో సామాను పట్టకపోతే సగం సామాను కోర్టులోనే వుంచుతున్నావట. ఆఫీసరున్న నాలుగు రోజులైనా ఆ సామాను అక్కడ లేకుండా చేయి. ఆయన పోగానే మళ్ళీ కోర్టుకు మారుద్దువుగాని. [A pause] తరువాత మీ గుమాస్తాఉన్నాడు చూచావూ? వట్టి నల్లమందు భాయి. జేబులో సేరుకు తక్కువ వుండదు. తడవకు కుంకుడుగింజంత మింగుతాడు. కుర్చీలో నిద్రపోతాడు. ఆ మత్తులో మనబోటి

వాళ్ళంవచ్చినా కుర్చీలోంచి లేవనే లేవడు. రికార్డంతా గాలికి కొట్టుకుపోతూ వుంటుంది. నాలుగు రోజులపాటు నల్లమందు తగ్గించమను. పైగా అతను నోరు తెరిచి మాట్లాడితే అలా పాడుకంపు కొడుతుందేమయ్యా! పయోరియా పచ్చిబద్దలు వుందేమో? నాలుగు రోజులు ఉల్లిగడ్డలో పాడో తినమను. లేదా మన డాక్టరుతో ఏదైనా లోషను ఇప్పించు.

పాన : చాలసార్లు ట్రైచేసి చూశాను. ఏం లాభంలేదు. బహుశా అది వంశపారంపర్యంగా వచ్చిన వాసనేమో? ఈ ప్లీడర్లూ, గుమాస్తాలూ మాట్లాడేటప్పుడు కోర్టంతా వ్యాపించే ఈ పాడు పరిమళం భరించలేకనే, అస్తమానం నా టేబులుమీద సాంబ్రాణి కడ్డీలు వెలిగించి వుంచుతాను.

చైనులు : మరో ముఖ్యమైన విషయం. కోర్టులో నీ ప్రవర్తన... మా బావమరిది ఉత్తరంలో వ్రాశాడు చూచావూ? మనలో సాధారణంగావుండే లోపాలను గురించి. ఇది మనకు తెలిసిన విషయమే. నే ప్రత్యేకంగా చెప్పేదేముంది? ప్రపంచంలో నిర్దోషి అంటూ వుండడు. అందరూ అంతో ఇంతో ఆచమనం చేసినవాళ్ళే, పైనాచూస్తే ఎంతటివాడికైనా మనసు చెమురుతుంది. అందులో నీవు పదిమంది పిల్లలుకలవాడివి. అయినా కాస్త పట్టూ, విడుపూ వుండాలి.

పాన : అవును. నాకర్థమైంది. నేను నిర్దోషినని ఎప్పుడూ చెప్పలేదు. నేను లంచాలు పుచ్చుకునేమాట వాస్తవమే. కాని ఎలాంటి లంచాలు? కోడిపెట్టలు, పొరచుట్టలు. అంతే.

చైనులు : లంచం అన్నతర్వాత లంచమే. కాల్చడానికి కాలాగ్ని కావాలటయ్యా? కణికెడు నిప్పుచాలదూ?

పాన : చైనులుగారూ! తమరొకవిషయంలో పొరపాటు పడుతున్నారు. [ఎత్తిపాడుస్తూ] ఆహారపుష్టి ఒకరినిబట్టి వుంటుంది. కొందరు గుళ్ళు మింగుతారు. కొందరు గుళ్ళో లింగాన్ని మింగు

తారు. ఇంకా కొందరు గుడీ, గుళ్ళో లింగాల్ని కూడా మింగు తారు. ఊళ్ళో ధర్మశాలలకని చందాలు వసూలుచేసి బంగళాలు కట్టించుకున్న మహాత్ములున్నారు. ఉలెన్ సూట్లు, భార్యకు పట్టుచీరెలు, కంట్రాక్టర్లదగ్గర, షావుకార్ల దగ్గర కాజేసే కట్టలు కట్టలు నోట్లూ, వీటినీ లంచాలనే అంటామగా?

చైనులు: సరేలే. ఆ విషయాలలావుంచు. పాపంచేసినప్పుడు పరిహారం కూడా వుండాలి. శివాలయంలో అభిషేకం చేయించరాదూ? కొంతయినా కొట్టుకపోతుంది.

పాన: అందరూ ఒకే తీరుగా వుంటారా! ఎవరిదోవ వారిది. నా నమ్మకాలు వేరు.

చైనులు: [హయగ్రీవంతో] ఇహ అయ్యవార్లంగారూ! మీా హైస్కూలు వ్యవహారం. టీచర్లందరినీ అదుపులో వుంచాల్సిన బాధ్యత మీాది. వాళ్ళంతా చదువుకున్నవాళ్లు; సమర్థులు. ఆ విషయం నాకు తెలుసు. కాని వాళ్ళ ప్రవర్తన చూస్తుంటే చాల విడ్డూరంగా వుంటుంది. అందుకే కాబోలు. చదువెక్కువైతే చాదస్తం కూడా ఎక్కువవుతుందంటారు. అందులో మరీ ఒకమాస్టరున్నాడు చూచావూ? అతనేమిటి మొహం లక్ష వంకర్లు తిప్పుతాడు? ఆఫీసరు చూస్తే ఏమనుకుంటాడు!

హాయ: నన్నేం చెయ్యమంటారు? నెత్తీ నోరూ కొట్టుకున్నా, మాస్టర్లు నా మాట వినిచస్తేనా? మొన్న డి. ఇ. ఓ. ఇన్ స్పెక్షనుకొస్తే ఆ సైన్సుటీచరు హైడ్రోజన్ ఎక్సుపెర్ మెంటుచేస్తూ అయిదు టెస్టుట్యూబులు పగులగొట్టాడు. జంతుశాస్త్రం బోధిస్తూ కప్పను తెచ్చి బల్లమీాద గంతులు వేయించాడు. క్లాసంతా ఒకటే గోల. డి. ఇ. ఓ. గారు నాకు వార్నింగ్ ఇచ్చి వెళ్ళారు.

చైనులు: అవును. మాటవరుసకు ఆ హిస్టరీమాస్టరు కిష్టయ్యవంతు లున్నాడు చూచావూ? పాఠంచెప్తూ నాటకంలోలా Act

చేస్తాడేమయ్యా? అలెగ్జాండరు, పురుషోత్తముడూ బాగానే చెప్పాడు. ఘజినీమహమ్మద్ దగ్గర కొచ్చేసరికి, మత్తగజంలా చిందులుతొక్కుతూ భయంకరంగా మారిపోయి, గుడ్లు తాటి కాయంతచేసి గోండ్రిస్తూ బల్లమీానినుంచి దూకి, కుర్చీని రెండు చేతుల్తో పైకెత్తి గుభేలుమని కిందపడేసి ముక్కలు ముక్కలు చేశాడు. బహుశా ఘజ్నీ, సోమనాథ దేవాలయం ఎలా పగులగొట్టిందీ చెప్పాడనుకుంటా?

హాయ: అవును.

చైనులు: ఆఁ! యుద్ధాన్ని కళ్ళముందు చిత్రించాడు. బాగానేవుంది. కాని బల్లలు, కుర్చీలు గవర్నమెంటు సొమ్ముకదయ్యా! రోజొక కుర్చీ విరగ్గొడితే ఎల్లా?

హాయ: అవును. అతనికి వేడి ఎక్కువ. ఆవేశం ఆపుకోలేడు. ఎన్నో సార్లు చెప్పాను. 'చరిత్ర పరిశోధనలో నా జీవితం ధారపోయ డానికి వెనుదీయను' అన్నాడు.

చైనులు: అలాగే ఆ డ్రాయింగుమాష్టరొకడు. స్కూలు గోడల నిండా బొగ్గుతో బొమ్మలుగీసి ఖరాబుచేస్తున్నాడు. అయినా అదేం కర్మయ్యా? బొమ్మలు గీయడానికి బ్లాకుబోర్డుందిగా?

హాయ: అతనికి మెమరీ డ్రాయింగులో మెడల్సు వచ్చాయి. మెమరీ ఎక్కువై కాస్త మెదడు చెడింది.

చైనులు: ఇక ఆ కురంగయ్య పంతులున్నాడు చూడు! పాఠాలు చెప్పినట్లే కనపడదు. అస్తమానం రామదాసు భజనకీర్తనలు పాడుతూ క్లాసులోనే హరికథ చెపుతాడు.

హాయ: ఏం చేయమంటారు? రామనామ సంకీర్తనంలోనే నా జన్మ రాలిపోవాలంటాడు.

చైనులు: అవును. జీవితంలోవున్న విచిత్రమిదే. తెలివి ముదిరిన వాళ్ళకు బుద్ధి సరీగా వుండదు. ఇంతకూ ఆ ఆఫీసరు రాకపోతే

ఈ గొడవలేమీ వుండేవికావు. ఏ క్షణంలోనో ప్రత్యక్షమై అబ్బాయిలూ! ఇక్కడున్నారా మీరంతా? ఏడీ డాక్టరు? మాజిస్ట్రేటు ఎక్కడ? ఏడీ హెడ్మాస్టరు? ఏదీ రికార్డూ? తెండి ఫైల్సూ? అన్నాడూ అంటే మన పని ఖా...ళీ [తలుపు తెరువబడు తుంది. అందరూ ఉలిక్కిపడతారు. పోస్టుమాస్టరు కాంతియ్య ప్రవేశిస్తాడు]

కాంత: ఎవరో ఆఫీసరు వస్తున్నాట్ట. నిజమేనా?

చైనులు: ఇప్పుడేనటయ్యా నీవు నిద్ర లేచింది?

కాంత: ఇంతకుముందే మిలిటరీయాలు పోస్టాఫీసు కొచ్చాడు. అతను చెప్తే విన్నాను.

చైనులు: దీన్ని గురించి నీ ఉద్దేశ్యం ఏమిటి?

కాంత: బహుశా ఎలెక్షన్ల హడావుడిఅయి వుంటుంది.

పాన: అదిగో! సరీగా నే చెప్పిందే!

చైనులు: ఛీ! ఇంతవరకూ ఒకడికే బుద్ధిలేదనుకున్నా. అందరూ అలాంటివాళ్లే! ఎలెక్షన్లు కాదు. మన కరప్షన్లు. మన బండారం బయటపడేస్తాడు. ఇంతకూ ఏ మాలోచించావు?

కాంత: నేనా? నాకేం తోచడంలేదు. మీరూ?

చైనులు: నేను మొండిఘటాన్ని. ఇలాంటివాటికి తొణికేరకం కాదు. కాని ఒక్కటే చిక్కు. ఆ వర్తకసంఘంవాళ్లున్నారు చూచావ్? వాళ్ళతో పెద్ద పేచీగావుంది. ఒకరో, ఇద్దరో కాస్త ముట్టచెప్పారనుకో. అయితేమాత్రం? నే చేసింది తప్పో, రైటో విచారించడానికి పైన భగవంతుడున్నాడు. వీళ్ళెవరు మధ్య? [కాంతియ్యను ఒకపక్కకు పిలిచి మెల్లగా] గిట్టనివాళ్లు నా మీద పిటీషన్లు పంపారనుకుంటున్నా. లేకపోతే ఆఫీసరెందుకు వస్తాడు? ఎందుకైనా మంచిది. ఒకపనిచేయి. పోస్టాఫీసునుండి పైకిపోయే ప్రతికవరూ చింపి, ఏముందో చదువు. మనకు సంబంధించింది కాకపోతే తిరిగి అంటించి సీలువేసెయ్. లేకపోతే సీలు

లేకుండానే త్రోసెయ్. మనకు సంబంధించింది అయితేమాత్రం తక్షణం తోక్కేసెయ్! తెలిసిందా?

కాంత: ఓ! తెలుసు, తెలుసు. మీరివన్నీ నాకు ప్రత్యేకంగా చెప్పాలా? ఇలాంటివాటిలో మనది పెట్టినపేరు. అసలు ఉత్తరం చింపకుండా పైకి పంపే అలవాటేలేదు నాకు. లోకంలో వ్యవహారాలన్నీ ఎలా సాగుతున్నాయో నాకు తెలుసుకోవాలని కుతూహలం. ఉత్తరాలు చదువుకోంటే ఎంత సరదాగా వుంటుందనుకున్నారు? పైగా జ్ఞానంకూడా వృద్ధి అవుతుంది. న్యూస్ పేపర్ల ఖర్చుకూడా తప్పుతుంది.

చైనులు: అయితే రాజధానినుంచి వస్తున్న ఈ ఆఫీసరు విషయం నీకేమైనా ఉత్తరాల్లో కన్పించిందా?

కాంత: No, No. అలాంటిదేమీ లేదు. గమ్మత్తయిన ఉత్తరాలు కట్టలు కట్టలు పోతున్నాయి. మీరు చదివితే మూర్ఛపోతారు. ఓ కాలేజి కుర్రాడు ఒక అమ్మాయికి రాశాడూ 'ప్రేయసీ! ప్రాణనాయకీ! మందయాన! కుందరదన! నళినీ! మృణాళినీ! నిన్ను మనసారా ప్రేమించాను. నా ప్రేమ కృష్ణానదిలా పొంగి పొరలి, ఓవరు బ్రిడ్జిమీదనుంచి ప్రవహిస్తోంది. నీ కోసం రాత్రింబగళ్లు కలవరిస్తున్నాను. మన పెళ్ళికి పెద్దవాళ్ళెవరూ ఆటంక పరచడానికి? ఇద్దరం ఎక్కడికో పిట్టల్లా లేచిపోదాం' అబ్బ! ఏం రొమాన్సు అనుకున్నారూ! మరో ఉత్తరం ఓ యువతి రాసింది. 'మావా రున్నారని సంకోచించవద్దు. ఆయనెప్పుడూ టూరింగు వెళుతుంటారు. కనుక స్వేచ్ఛగా రావచ్చు' తమ షాగా వున్నాయని దాచిపెట్టాను. ఇస్తాను చదువుతారా?

చైనులు: ఇప్పుడు తీరుబడిలేదు. తరువాత చూద్దాం. కాని ఇది మాత్రం జ్ఞాపకం వుంచుకో. ఏమైనా మనమీద కంప్లయింటు కనపడిందా, వెనుకా, ముందూ ఆలోచించక వెంటనే ఆపుచేయి!

కాంత: తప్పకుండా చేస్తాను.

పాన : [కాంతయ్యతో] ఇదిగో, మాస్టరూ! అలా చేశావూ అంటే ఎప్పుడో బొక్కలో తోస్తారు జాగ్రత్త!

చైనులు : నాన్సెన్సు. ఇదేం పబ్లిగ్గా చేస్తున్నామా? ప్రయివేటు వ్యవహారం. ఫామిలీ ఎఫేర్. సీక్రెట్‌గా వుంటుంది.

పాన : చైనులుగారూ! మీకు మరోవిషయం చెప్పనా? ఊళ్లోకి యానాది భాగోతులొచ్చారు. అందులో ఒక పిల్లవుంది. ఏం పిల్లండీ! ఏనాది పుటకఅయితేమాత్రం ఏం? అప్సరసలా వుంటుంది. పిలిపిస్తాను చూస్తారా?

చైనులు : ఆపవయ్యా ఇప్పుడా గొడవలన్నీ! ఇప్పుడున్న సమస్య ఒక్కటే! యముడల్లే నెత్తిమీదికొచ్చి కూచున్న ఈ ఆఫీసరు. ఇలా మనమంతా కూచుని మాట్లాడుతుండగానే హఠాత్తుగా తలుపు తెరుచుకుని... [తలుపు తెరుచుకుంటుంది. అందరూ ఎగిరిపడతారు. మిరియాలు, ధనియాలు రొప్పుకుంటూ ప్రవేశిస్తారు.]

మిరి : ఎన్నడూ జరగని విషయం జరిగింది!

ధని : ఇలాంటిదెప్పుడూ జరగలేదు!

చైనులు : ఏం జరిగింది? ఏమిటది?

మిరి : అసాధారణమైన విషయం.

ధని : అకస్మాత్తుగా వచ్చిన వర్తమానం.

మిరి : అతి విచిత్రం!

ధని : అత్యద్భుతం! మేము హోటల్లోకి వెడుతూవుంటే...

మిరి : [మధ్యలో కలిగించుకుని] కాదు. నేనూ, ధనియాలూ కలిసి హోటల్లోకి వెడుతూవుంటే...

ధని : [మధ్యలో కలిగించుకుని] ఒరేయ్ మిరియాలూ! నన్ను చెప్పనీయరా!

మిరి : కాదు. నేనే చెపుతాను. ఒరేయ్ ధనియాలూ! నీకు చెప్పడం చాతకాదురా. నన్ను చెప్పనీయరా నాన్నా!

ధని : కాదు. నీకు గాభరా ఎక్కువ. నేనైతే అరిటిపండొలిచి చేతిలోపెట్టినట్లు చెపుతాను.

మిరి : ఒరేయ్, నీకు నోట్లో నాలిక లేదు.

ధని : ఒరేయ్, నీ నాలిక నోట్లో లేదు.

మిరి : నీకు చూచిన విషయం జ్ఞాపకం లేదు.

ధని : నీవు అసలువిషయం చూడనే లేదు.

మిరి : నీవసలు చూళ్లేదు. చూచినా జ్ఞాపకముండదు. ఉన్నా చెప్పలేవు. చెప్పినా అర్థంకాదు. కాబట్టి నన్ను చెప్పనీయరా నాన్నా! [శైనులతో] గురువుగారూ! ఈ వెధవను నోరుమూయించండి.

శైనులు : ఇష్! ఆ ఏడ్పేదేమిటో సరిగా ఏడవండి వెధవలు. ముందు కూచుని మాట్లాడండి.

[అందరూ కూర్చుంటారు. ఖాళీగావున్న ఒక కుర్చీలో మిరియాలు, ధనియాలు ఒకరినొకరు తోసుకుంటూ కూర్చుంటారు]

మిరి : చెప్పమంటారా? అంత్యంలో మొదలెట్టి ఆదివరకూ చెప్తాను. అహా! ఆదిలో మొదలెట్టి అంత్యంవరకూ చెప్తాను ... తమకు ఆ ఉత్తరం చేరినతర్వాత తమ దగ్గిర సెలవు తీసుకుని వెళ్లాను. నేనలా వెడుతోంటే ... [అంతలో ధనియాలు ఏదో చెప్పబోతాడు. మిరియాలు అతన్ని ఆపుచేస్తూ] ఒరేయ్! నీవు మధ్యంలో మాట్లాడకు. నాకంతా జ్ఞాపకముంది. [శైనులుతో] ఆ! అలా వెడుతోంటే కాదు. పరుగెత్తుకుంటూ శేషయ్యగారింటికి వెళ్ళాను. ఆయన ఇంట్లో లేడు. అక్కణ్ణుంచి భూషయ్యదగ్గర కెళ్ళాను. ఆయనా ఇంట్లో లేడు. అప్పుడు మన పోస్టుమాస్టరు కాంతయ్యదగ్గిరికి వెళ్లి విషయమంతా చెప్పాను. అక్కణ్ణుంచి వస్తోంటే ధనియాలుగాడు ఎదురుపడ్డాడు.

ధని : అవును, ఎదురుపడ్డాను. ఎక్కడంటే మిఠాయి కొట్టు మాణిక్యమ్మ దగ్గర. అహా! మాణిక్యమ్మ మిఠాయికొట్టు దగ్గర.

మిరి: అవును. మాణిక్యమ్మ మిఠాయికొట్టుదగ్గర. అప్పుడు నేను ధనియాలును అడిగాను. 'ఏంరా, మరి గురువుగారికి ఉత్తరం వచ్చిందే విన్నావా?' అన్నాను నేను. 'నాకు ముందే తెలిసింది లేవోయ్. గురువుగారి నౌకరు అబద్ధాలు నాకంతా చెప్పాడు' అన్నాడు ధనియాలు. ఇంకేం. ఇద్దరంకలిసి భూషయ్యదగ్గరకు వెడదామనుకున్నాం. కాని కాస్త లెక్కపోగానే ధనియాలు 'ఒరేయ్, నా కడుపులో ఎత్తులేదు. కాస్త టిఫిను పడాలి. గణపతి హోటల్లో రెండు పెసరట్లు తినిపోదాం' అన్నాడు. ఆపళాన ఇద్దరం గణపతి హోటల్లోకి వెళ్లాం. మేమలా హోటల్లోకి వెళ్లి కూచున్నామోలేదో, ఒక యువకుడు...

ధని: యువరాజులా వున్నాడు. కాని దుస్తులు సామాన్యంగానే వున్నాయి.

మిరి: అవును. యువరాజులా వున్నాడు కాని దుస్తులు సామాన్యంగానే వున్నాయి. అతనిమొహంచూస్తే రాజకళ వుట్టిపడుతోంది. అతని మొహం రంగురంగుల వెలుగు వెదజల్లుతోంది. అదృష్ట దీపుడులా వున్నాడు. అతన్ని చూడగానే చెప్పవచ్చు ఫలానా అని. అప్పుడు నేను ధనియాలుతో 'ఎవర్రా అయస్కాంతంలా ఆకర్షిస్తున్నాడు?' అన్నాను. మా ఇద్దరికీ అతనెవరో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. వెంటనే ఆ హోటలు ప్రొప్రయిటరు గణపతిని పిలిచాం. [చెప్పేవిషయం వదిలేసి మరో విషయంలోకి పోతాడు] గణపతి అంత లావుగా వుంటాడుగాని అతని భార్య సన్నగానే వుంటుంది. అతని కొడుకు ఈ మధ్య అమెరికా వెళ్ళొచ్చాడు. ఇప్పుడు మంగళగిరిలో హోటలు పెట్టాడు.

పాన: ఇష్! అసలుసంగతి చెప్పవోయ్!

మిరి: ఆ! మేము గణపతిని పిలిచి 'గణపతీ! ఎవరయ్యా ఈ రాజపురుషుడు?' అని అడిగాం. అప్పుడు గణపతి...

ధని: [మధ్యలో అందుకుని] అప్పుడు గణపతి...

మిరి: ఉండరా! [ధనియాలును ఆపుచేసి మళ్ళీ చెప్ప నారంభిస్తాడు] ఆయన నొక ఆఫీసరనీ, ఢిల్లీనుంచి వచ్చాడనీ, ఆయనపేరు వసంత కుమార్ అనీ చెప్పాడు. అంతేకాదు. ఆయన అతి విచిత్రంగా ప్రవర్తిస్తాట్ట! వచ్చి రెండువారాలైందట. ఇప్పట్లో వెళ్ళేటట్లు లేడట. ఉన్నందుకు, తిన్నందుకు డబ్బివ్వడట! అంతా అప్పే నట. గణపతి ఇలా చెప్పేసరికి నా గుండె గుభేలుమంది. అప్పుడు నేను ధనియాలుతో 'హా' అన్నాను.

ధని: కాదు. ముందు నేనే అన్నాను.

మిరి: కాదు. ముందు నేనే అన్నాను.

పాన: ఏయ్! ఏమన్నారో చెప్పండి?

మిరి: పోనీయండి. ముందు వాడే 'హా' అన్నాడు. కాని నేను కూడా 'హా' అన్నాను.

ధని: ఒరేయ్!

మిరి: ఇద్దరం కలిసే అరిచాం. తరువాత గణపతితో 'ఇంత పెద్ద ఆఫీసరు ఇంతకాలం ఇక్కడ మకాంచేయడానికి అవసరమేముంది?' అని అడిగాం.

చైనులు: ఎవరు? ఏ ఆఫీసరు?

మిరి: ఇంకెవరు? అతనే! మీకు ఉత్తరం వచ్చింది చూచారూ? అతనే! ఢిల్లీనుంచి మనం వస్తాడనుకుంటున్న ఇన్‌స్పెక్టర్‌జనరల్!

చైనులు: No, No. అతనెందుకవుతాడు?

ధని: అతనేనండీ! ముమ్మాటికీ అతనే? ఇక్కడే పీఠంపెట్టాడు. ఎవరికీ డబ్బివ్వడంలేదు. ఆఫీసరు కాకపోతే ఎందుకలాచేస్తాడు? ఇంకొకడైతే ఎన్ని దమ్ములున్నాయి అలా చేయడానికి!

మిరి: అతనే! అందుకే అలా చూచాడు.

ధని: పరీక్షగా చూచాడు.

మిరి: మేము పెసరట్లు తింటోంటే దగ్గరకొచ్చి ప్లేట్లు పరీక్ష చేశాడు. నాకు షాక్ కొట్టినట్లయింది.

చైనులు: చచ్చాంరా దేవుడా! ఆ రూము నెంబ రెంత?
ధని: నెంబరు ఫోర్, మేడమీద.
మిరి: గత సంవత్సరం ఇద్దరు ఆఫీసర్లు ఒక అమ్మాయికోసం పోటా పోటీ పడి తన్నుకున్నారే! అదేగది, మేడమీద నాలుగు!
చైనులు: ఇంతకూ అతను వచ్చి ఎన్నిరోజులైంది?
ధని: పదిహేనురోజులు. సరీగ్గా సంక్రాంతినాడొచ్చాడు.
చైనులు: అమ్మనాయనో! రెండువారాలే! ఊరంతా కంపుకొడుతోంది. రోడ్లన్నీ పెంటకుప్పలతో మురుగుతున్నాయి. ఠానంతా తగలడ్డట్టుంది. ఉద్యోగం డిస్‌మిస్. చేతులకు సంకెళ్ళు! శిక్ష! ఉరిశిక్ష! [తలపట్టుకుని కుర్చీలో కూలబడతాడు]
హాయ: శ్రీమతే రామానుజాయనమః [కూలబడతాడు]

[ఒక క్షణం నిశ్శబ్దం]

కైలాస: చైనులుగారూ! అందరం వెళ్ళి ఆయన్ను ఆహ్వానించి తీసుకొద్దామా?
చైనులు: [తెప్పరిల్లుకొని] వద్దు వద్దు. నే నొక్కణ్ణే వెడతాను. అందరం వెడితే ఏదో అభాసవుతుంది. ఇదివరకొకసారి చిక్కుల్లో పడ్డాను. ఒంటరిగా వెళ్ళటం బెటర్. ఏదైనా బేరం పెట్టొచ్చు. దేవుడు చల్లగా చూస్తే ఇప్పటికైనా మించిపోలేదు. [మియాలుతో] కుర్రాడని చెప్పావు కదూ?
ధని: అవును గురూజీ! మహావుంటే ఇరవైమూడు, లేక ఇరవై నాలుగు.
మిరి: కాదు గురూజీ! ఇరవైరెండూ, లేక ఇరవైమూడు.
చైనులు: గుడ్! కుర్రాడైతే విల్లంబద్దలా వంచొచ్చు ముసలాళ్ళతో మహా కష్టం. ఇహ మీరంతా మీమీ పనులమీద వెళ్ళండి. నే నొక్కణ్ణే వెళ్ళి అతన్ని తీసుకొస్తాను. కాకపోతే ధనియాలు తోడొస్తాడు.

[కానిస్టేబులు ప్రవేశించి శాల్యూట్ చేసి నిలబడతాడు]

చైనులు: [కానిస్టేబులుతో] తక్షణం వెళ్లి సబుఇన్‌స్పెక్టర్ను పిలుచుకరా. [అతను వెళ్ళబోతుంటే మళ్ళీ ఆపుచేస్తాడు] ఉండుండు. నీతో పనుంది. మరెవరినైనా పంపి సబుఇన్‌స్పెక్టరు ఎక్కడున్నాడో వెదికి పట్టుకరమ్మను. క్విక్.

కాన్‌స్టే: యస్. సార్. [పరుగెత్తుతాడు. చైనులు లోపలికి వెడతాడు)

కైలాస: [పానకాలుతో] మనం కూడా వెళ్ళి సన్నాహాలు చేసుకుందాం.

పానకాలు: ఉండవయ్యా ఏమిటి తొందర? నీవు చేసేదేముంది? నాలుగు మంచాలు లాగేసి హాస్పిటలు కాస్త క్లీన్‌చేయిస్తేసరి.

కైలాస: ఏం క్లీన్‌చేస్తామండీ! హాస్పిటలంతా అధ్వాన్నంగా వుంది.

పాన: అంతేమరి. నేను మాత్రం ఏం చేస్తాను? నా కోర్టంతా కోళ్ళకంపు. అంతేకాదు. ఆఫీసరు కోర్టు రికార్డు చూచాడూ అంటే, మన బోర్డు తిరిగిందన్నమాటే. రికార్డంతా బండబూతులు. ఫైల్సు అన్నీ తారుమారయినాయి. ఏ కేసు ఫైలు ఎక్కడుందో ఎవడికీ తెలీదు. ముద్దాయిలు సాక్షులుగా, సాక్షులు ముద్దాయిలుగా రికార్డయింది. వాళ్ళు చెప్పేదొకటీ, గుమాస్తా రాసేదొకటి. ఏది నిజమో, ఏది అబద్ధమో బ్రహ్మదేవుడు కూడా కనుక్కోలేడు. ఏం చేస్తాం? ఎన్నో ఏళ్ళబట్టి ఈ ఉద్యోగం వెలగబెడుతున్నా. చేసీచేసీ చేతులు కడుక్కున్నా.

[పానకాలు, కైలాసరావు, హయగ్రీవం, కాంతయ్య వెళ్ళిపోతారు. వాళ్ళు వెడుతోంటే కాన్‌స్టేబులు ఎదురవుతాడు.]

చైనులు: [ప్రవేశిస్తూ, కాన్‌స్టేబులుతో] మన టాక్సీ వాకిట్లో వుంది కదూ?

కాన్: యస్ సార్!

చైనులు: నీవు బజారెళ్ళి...కాదు. కాదు. వెళ్ళి ఆ హెడ్‌కాన్‌స్టేబులు ఎక్కడున్నాడో పిలుచుకురా! ఇక్కడుండమని పొద్దు

ననంగా కబురుచేశాను. ఇంతవరకూ రాలేదు. ఎక్కడ చచ్చాడో ఏంపాడో?

కాన్ : ఇంట్లోనే వున్నాడు సార్. ఇవాళ డ్యూటీ చేయ లేడు.

చైనులు : ఏం? ఏ మొచ్చింది వెధవకు?

కాన్ : తప్పతాగి పడున్నాడుసార్. స్పృహలేదు. పొద్దున్నే ఇంటికి మోసుకొచ్చాను. పది బిందెల నీళ్లు పోసినా మత్తు వదల్లేదు.

చైనులు : ఓ! మైగాడ్! [తల కొట్టుకుంటాడు] అర్జంటుగా బజా రెళ్ళి...కాదు కాదు. లోపలికివెళ్ళు నా తలగుడ్డ, చేతికర్ర, చెప్పులు పట్టుకరా! [కానిస్టేబులు ఇంట్లోకి వెడతాడు]

మిరి : [చైనులుతో] గురువుగారూ! నన్నుకూడా మీతో రమ్మంటారా?

చైనులు : వీల్లేదు. టాక్సీలో ఇంతమందికి జాగాలేదు.

మిరి : పోనీలెండి. నేను కారు వెనకాలే పరుగెత్తుకొస్తాను. తలుపు బొక్కల్లోంచి చూస్తుంటాను. [వెడతాడు] [కానిస్టేబులు లోపల్నించి తలగుడ్డ, కోటు, చేతకర్ర, చెప్పులు పట్టుకొస్తాడు.]

చైనులు : [కోటు తీసుకుంటూ] ఏమిటి ఈ బూజంతా దులిపి ఇవ్వరాదూ? ఎలా మరకలుపడ్డాయో చూడు! ఆ చాకలి వెధవకు బుద్ధిలేదు. అసలు బంగారంలాంటిగుడ్డ. ఆ టైలర్ చేతుల్లోపడి పాడై పోయింది. [కోటు తొడుక్కుంటూ] ఒకచెయ్యి బిగుతూ, ఒకచెయ్యి వదులూ. చంకల్లో చచ్చేంత టైట్‌గా వుంది. స్కౌండ్రల్సు! పైగా సంఘాలుపెట్టి నా మీద కంప్లయింటు ఏడుస్తారట. [కానిస్టేబులుతో] పరుగెత్తుకుంటూవెళ్ళి ఆ పనివాళ్లను పిలువు. రోడ్లు తీసుకుని చీపుర్లు ఊడవమను. కాదు కాదు చీపుర్లు తీసుకుని రోడ్లు ఊడవమను. ముఖ్యంగా ఆ గణపతి హోటలుదగ్గర. అంతా అద్దంలా వుండాలనిచెప్పు. ఒకవేళ వాళ్లు దొరక్కపోతే ఆ పని నీవే చేసెయ్యాలి.

కాన్: [నిర్వీర్యపోతూ] ఆ!

చైనులు: ఏం ఫరవా లేదు. నీ సంగతి నాకు తెలుసు. కొట్లచుట్టూ తిరిగి, అందర్నీ డబాయించి డబ్బు కాజేస్తున్నావటగా? ఆ బట్టల కొట్లో ఒక తానుకుతాను కాకీగుడ్డ కొట్టేశావట! అంతగుడ్డ తీసుకోడానికి నీవ్వుతగవు. నీ Rank ఏమిటి? ఎ పెటీ కాన్‌స్టేబులు! ఒక గజంగుడ్డ. అదీ యూనిఫారంకోసం. అంతే. ఇక వెళ్లు!

[కాన్‌స్టేబులు వెళ్ళిపోతాడు. సబు ఇన్‌స్పెక్టరు పరాంకుశం ప్రవేశిస్తాడు. శాల్యూట్ చేసి నిలబడతాడు.]

చైనులు: పరాంకుశం! ఎక్కడ మాయమైనావయ్యా? ఇప్పుడా రావడం? Insult!

పరాం: నే నిక్కడే గేటుదగ్గరున్నానండీ.

చైనులు: సరే. ముందిది విను. రాజధానినుంచి ఇన్‌స్పెక్టర్ జనరల్ వచ్చాడు. నీ వేమైనా ఏర్పాట్లు చేశావా?

పరాం: మీ ఆజ్ఞానుసారం హెడ్ కాన్‌స్టేబుల్ని పందిళ్లు చూడమని పంపాను.

చైనులు: ఆ హెడ్ కాన్‌స్టేబులు తాగి పడున్నాట్టగా? ఎందుకు తాగనిచ్చావు?

పరాం: ఊరిబయట ఎరుకలగూడెంలో రాత్రి కొట్లాట జరిగింది. సర్దుబాటు చేస్తానని వెళ్ళాడు. వచ్చేటప్పటికి వళ్లు తెలీకుండా తాగివున్నాడు.

చైనులు: సరే, ఇది విను. ప్రభల్లే పొడుగ్గా వుంటాడే కాన్‌స్టేబులు! అతన్ని ఆ నాలుగు బజార్ల సెంటరులో నిలబెట్టు. రోడ్డు మీద కాస్త కళకళలాడుతూ కనిపిస్తుంటాడు. ఆ గాంధీవిగ్రహం చుట్టూ ముళ్ళకంప పడేసి బొమ్మ కన్పించకుండా చేశారు. అక్కడే ఉమ్ములు, తమ్ములు, చుట్టముక్కలు, అరటితొక్కలు. డర్టీ! డర్టీ పీపిల్! Most uncivilized Brutes! అదంతా క్లీన్ చేయించు. జవాను ముండాకొడుకులు ఒక్కడూ కంటికి

కన్పించడు. అంతా రోగ్స్! [అంటూ తలగుడ్డ తలకిందులుగా పెట్టు కుంటాడు. పరాంకుశం అది గమనించి హెచ్చరిక చేస్తాడు]

పరాం: ఆ తలగుడ్డ సరీగా పెట్టుకోండిసార్!

చైనులు: [సరిచేసుకుంటూ] ఓ! తొందర్లో గందరగోళ మవుతుంది. [చెప్పులు తొడుక్కుని చేతికర్ర తీసుకుంటాడు] మరో ముఖ్యమయిన విషయం. పోలీసుల్నిగాని, జవాన్లనుగాని – ఎవరినైనా సరే, 'మీ వుద్యోగాలెలా వున్నాయి? జరుగుబాటు సరీగా వుందా?' అని ఆఫీసరడిగితే 'ఆ! హాయిగా పరిగెపిట్టల్లా వున్నామ'ని చెప్పమను. ఇదిగో! వాళ్ళకొక్కవల్సిందేదో నాతో ఏడవమను. అదేదో నేను చూస్తాను. అంతేగాని ఆఫీసరుతో చెప్పుకోవద్దను తెలిసిందా? [నాలుగడుగులు వేసి మళ్ళీ వెనక్కి వస్తాడు] పోతే ధర్మాసుపత్రి కట్టిస్తామని రెండేళ్ళనాడు చందాలు వసూలు చేశాం. ఎవరైనా ఎందుకు కట్టించలేదని అడిగితే, 'కట్టించాం. కాని పూర్తి చేస్తుండగానే కాలిపోయింది' అని చెప్పమను. తెలిసిందా? నేనా విషయం అప్పుడే ఒక రిపోర్టు వ్రాసి పంపానులే. ఏ వెధనైనా అది అసలు మొదలెట్టలేదని చెపుతాడేమో, కొంపదీసి. జాగ్రత్త! [తిరిగి నాలుగడుగులు వేసి వెనక్కి వస్తాడు] మరో విషయం. ఆ పోలీసువాళ్లు చొక్కాల్లేకుండా నిక్కర్లు వేసుకుని వూరంతా తిరుగుతుంటారు. మడ్డి మొహాలు వాళ్లు. హోటళ్ళదగ్గర, అన్నిచోట్లావాళ్ళే! ఆ యూనిఫారాలు ఏడవమను. సరే. ఇహ నీవు వెళ్లి ఆ పనులు చూడు. [పరాంకుశం వెడతాడు. చైనులు ఎదురుగా గోడకున్న శ్రీ ఫొటో దగ్గరకు వెళ్లి వెంకటేశ్వరస్వామి అని దణ్ణంపెడతాడు మళ్ళీ తిప్పాడని వెంకటేశ్వర స్వామి పటందగ్గరకు వెళ్లి నమస్కరిస్తాడు. కాళ్ళకు చెప్పులున్నాయని గ్రహించి, లెంపలు వాయించుకుని, చెప్పులు విడిచి తిరిగీ నమస్కరిస్తాడు. ధనియాలు కూడా నమస్కరిస్తాడు] ఏడుకొండల వాడా! వెంకటరమణా! వడ్డికాసుల వాడా! వరహాల తండ్రీ! ఈ గండం గట్టెక్కించావూ అంటే, వచ్చే ఏడు కుటుంబంతో సహా

నీ కొండకు వస్తాను. నీ ముడుపులు చెల్లిస్తాను. [చైనులు, అతని వెంట ధనియాలు, బయటికి వెడతారు, చైనులు భార్య కోమలమ్మ లోపల్నుంచి గబగబ ప్రవేశిస్తుంది]

కోమ: ఏరీ! ఎవ్వరూ లేరే? [ఎదురుగావున్న గది దగ్గరికి వెళ్ళి లోపల ముస్తాబవుతోన్న కూతుర్ని చూస్తుంది] అమ్మా యీ తిలకం? నీవింకా ముస్తాబులోనేవున్నావు? జడవేయడం గంట, పిన్నులు పెట్టడం గంట. తొందరగా కానీయి. ఆ రాళ్ళ నెక్లేసు పెట్టుకో. [గబగబ కిటికీవద్దకు వెడుతుంది. కిటికీలోంచి వీధిలోకి చూస్తుంది టాక్సీలో వెళ్ళిపోతున్న భర్తను చూస్తూ బిగ్గరగా] ఏమండోయ్! ఎక్కడికి వెడుతున్నారు? ఆఫీసరొచ్చాడా? [కూతుర్ని] అమ్మాయ్! ఇలారా ఒక్కమాటు. నా మెళ్ళో నెక్లేసు ఊడిపోతోందిగాని, ఒకసారి పెట్టిపోమ్మా! [కూతురు తిలకమ్మ ప్రవేశిస్తుంది తల్లిమెళ్లో నెక్లేసు సరిచేస్తుంటుంది] ఇదిగో అమ్మాయ్! త్వరగా కానీయి. ఆ పూల పరికిణీ కట్టుకో. ఆ ఆఫీసరు ఎప్పుడొస్తాడో ఏమో?

తిల: వస్తాడే అమ్మా? ఇంత దూరం వచ్చినవాడు ఇంటికి రాకపోతాడా, నీదంతా హడావుడిగాని?

కోమ: [మళ్ళీ కిటికీవద్దకు వెళ్ళి వీధిలోకి చూస్తుంది. వీధిలోవున్న నౌకర్ని పిలుస్తూ] ఒరేయ్ సుబ్బన్నా! నీవుకూడా మీ అయ్యగారితో వెళ్ళి ఆఫీసర్ని చూచిరా! ఎలాఉన్నాడో చెప్పు! ఊఁ! వెళ్లు! త్వరగా వెళ్లు! పరుగెత్తు! [కోమలమ్మ కేకలుపెడుతూవుండగా]

[ తెర ]

# రెండో రంగము

[అదే రోజు మధ్యాహ్నంవేళ. గణపతి హోటల్లో మేడమీద చిన్నగది. గదిలోకి అంతగా వెలుతురు రావడంలేదు. ఒక మంచం, దానిమీద జెడ్డావున్నాయి. ఒక చిన్న టేబీలు, దానిమీద ఖాళీగ్లాసు, పేకముక్కలు వున్నాయి. రెండు కుర్చీ లున్నాయి. తెర తీసేసరికి వసంతకుమార్ మంచంమీద పడుకుని అటూ ఇటూ పొర్లుతూవుంటాడు. అతని సేవకుడు చక్రపాణి ఒక మూలనవున్న ట్రంకుపెట్టెమీద తలపట్టుకుని కూచుంటాడు. ఇద్దరి మొహాలూ పీక్కుపోయి వుంటాయి]

వసంత: చక్రపాణీ! ఆకలి! ఆకలి దహించుకపోతోంది. కడుపులో డోళ్ళు వాయిస్తున్నట్టుగావుంది. ఈ బాధ భరించలేను.

చక్ర: నాకూ అట్లాగేవుంది. ఎత్తుపడ్డ గొడ్డులా అయిపోయాను. ఇలా పస్తులతో ఎంతకాలం బ్రతుకుతాం. కొంపకుచేరే మార్గం కన్పించడంలేదు.

వసంత: చక్రపాణీ! మనం ఢిల్లీ వదలిపెట్టి ఎన్నిరోజులైంది?

చక్ర: రోజులుకాదు, నెలలు. రెండునెలలైంది. ఇలాగే చూస్తోంటే నాలుగు నెలలుకూడా అవుతుంది. ముందు ఈ ఊరినుంచి బిచాణా ఎత్తేయాలి. ఈ హోటలువాడు డబ్బివ్వందే మనల్ని వదిలిపెట్టేటట్లు లేడు. ఏంచేయాలో తోచకుండా వుంది.

వసంత: [మాట్లాడడు. ఏదో ఆలోచిస్తుంటాడు]

చక్ర: [లేచి దగ్గరకొచ్చి మెల్లగా] చార్జీలకు పోగా దగ్గర ఎంతో డబ్బుండాల్సినమాట. కాని ఏంలాభం? దారిపొడుగునా డబ్బు వెదజల్లాం. నీళ్ళలా పారపోశాం. కనిపించిన ఊళ్ళోఅల్లాఆగడం, అక్కడ జల్సాచేయడం. అంచేతనే ఉన్నదంతా ఊడ్చుక పోయింది. ఇంకేముంది? ఇప్పుడు తోకముడుచుకుని కూచున్నాం. మొదటినుంచీ నేను మొత్తుకుంటూనే వున్నా. నా మాట

వింటేనా? [అభినయిస్తూ] 'ఒరేయ్, చక్రపాణీ! ఒకటోరకం హోటల్లో దిగాలి. గది అద్దెకు తీసుకుందాం. మంచిగది చూడాలిసుమా! ఒకటో నెంబరు గది. మంచి భోజనానికి ఆర్డరివ్వు. మామూలు భోజనమైతే దాని మొహం చూడను. మజా అయిన భోజనం తెప్పించు' అన్నారు మీరు.

వసంత: అవున్నా! మన ఖర్మ కాలి ఈ వెధవ గుమాస్తాఉద్యోగం ఏడవాల్సివచ్చిందిగాని, మనం ఎలాంటివాళ్ళమో, ఎట్లా బ్రతికామో నీకు తెలియదట్రా చక్రపాణీ?

చక్ర: తెలుసు మహాప్రభో తెలుసు. తెలియబట్టే చెపుతున్నా ఇహనైనా జాగ్రత్తగావుండమని. డబ్బనేది ఖర్చుపెడుతుంటే ఎంతకాలంవస్తుంది? కొండకూడా తరిగిపోతుంది. కర్పూరంలా కరిగిపోతు ది. అయ్యగారూ! ఒకమాట చెప్తాను వింటారూ?

వసంత: [ఏమిటన్నట్లు చూస్తాడు.]

చక్ర: మీరా పేకాట మానుకోవడం మంచిది. చీట్లాటలో చెడిపోనివా డెవడున్నాడు చెప్పండి? పేరుకు గవర్నమెంటు ఉద్యోగం గాని, ఆ గుమాస్తాగిరిలో వచ్చే ఆదాయం ఎంత? మీ జీతం చాలక నాన్నగారినికూడా డబ్బు పంపమంటున్నారాయె! దీనికి తోడు జూదంలోకి దిగితే ఇహ జర్రుకున్నట్లే.

వసంత: ఒరేయ్! వెధవవాగుడువాగక. నీ మొహం, నీకేం తెలుసు పేకాట సంగతి? పేకాట శ్రీమహాలక్ష్మిరా వెధవ! ముక్క ఎక్కాలేకాని ఒక్కక్షణంలో పోయినదంతా కొట్టుకొస్తుంది. ఇటీవల మన నసీబు బాగా లేదు కనుక ఆ వెధవలంతా నన్ను గొరిగించారు. లేకపోతేనా? [a pause] ఒరేయ్, చక్రపాణీ! ఇప్పుడెలాగైనా డబ్బుకావాలి. [క్షణం ఆలోచించి] మనదగ్గర ఇంకా ఒక సూటువుంది. అదికూడా అమ్మేస్తే ఏం? వచ్చినదాంట్లో హోటలువాడికి కొంత జమకట్టి మిగతాదాంతో ఆటకు కూచుం

టాను. మన చక్రం తిరిగిందీ అంటే, వారంనుంచి ఓడిందంతా ఒక్క దెబ్బతో వచ్చేస్తుంది. ఎలావుంది ప్లాను?

చక్ర: చాలాబాగుంది. ఇప్పటికే ఎన్నో సూట్లూ, పాంట్లూ అమ్మేశారు. కావాలన్నప్పుడు వందలొందలుపోసి కుట్టించడం, డబ్బుకు ఇబ్బందిరాగానే వాటిని ఏ పదికో, ఐదుకో పాడు చెయ్యడం. అయినా ఆ ఒక్క జతయేగా వుంది! వెళ్ళక వెళ్ళక ఎంతో కాలానికి వెడుతున్నాం మన ఊరు. ఈ పాడుబట్టలు కట్టుకొని పోతే చూచేవాళ్లు ఏమనుకొంటారు?

వసంత: అనుకుంటే అనుకోనీ! ఎప్పుడూ మనవంక విరగబడిచూచే ఆడాళ్లు వెనక్కుపోతారు. అంతేగా! పోతేపోనీ! (a pause] ఇప్పుడెలాగైనా డబ్బు కావాలి.

చక్ర: ఇంకేదైనా మార్గం ఆలోచించండి. ఈ సూట్లూ బూట్లూ అమ్మితే మన దరిద్రం తీరుతుందా! ముందిక్కణ్ణుంచి కదిలే మార్గం ఆలోచించండి.

వసంత: ఆలోచిస్తున్నా! మళ్లీ ఢిల్లీ అయినా చేరేమార్గం ఏమిటా అని? ఢిల్లీలోవుంటే ఇన్ని చిక్కులుండవు. ఎవడో ఒకడు వల్లో పడతాడు.

చక్ర: ఢిల్లీ, ఢిల్లీ! ఆ మాట అంటేనే నాకు వళ్లు మండుతుంది. హు! ఏం జీవితం? పైసా చేతులలో ఆడుతున్నంతవరకూ పైలా పచ్చీసుగా వుంటుంది. లేనినాడు పస్తు. ఒక్కడూ పలకరించడు. అందరూ దగాకోర్లు, దగుల్బాజీలు! వద్దు. తిన్నగా ఆ పల్లెకొంపకు చేరదాం పదండి. ఆ ముసలాయన యిప్పటికే ఎంత ఘోషిస్తున్నాడో మీరు రాలేదని. పల్లెలో మనకీ చిక్కులుండవు. ఎలాగైనా మన వూరు చేరే మార్గం ఆలోచించండి.

వసంత: సరేలేవోయ్, నీ వెధవ కబుర్లు! ముందా పెట్టెలో చుట్టలున్నాయేమో చూడు.

చక్ర : ఎక్కడున్నాయి? చుట్ట మొహం చూచి ఎన్నిరోజులైంది?
వసంత : పోనీ పొగాకు?
చక్ర : పొద్దున్నే ఒక కాడవుంటే తీసుకున్నారుగా!
వసంత : [కొద్ది క్షణాలు ఆలోచిస్తూ అటూ ఇటూ తిరుగుతాడు. పొట్ట చేత్తో పట్టుకుని] కడుపులో మండుతోంది. హిరణ్యాక్షుడిలా భూగోళాన్నంతా మింగేయాలని వుంది. ఒరేయ్, చక్రపాణీ! ఒకసారటు వెళ్లిరా!
చక్ర : ఎక్కడికి?
వసంత : క్రిందికివెళ్లి ఆ హోటలు వాడితో భోజనం పంపమని చెప్పు.
చక్ర : నా వల్లకాదు.
వసంత : ఏమిటి నీ అహంకారం?
చక్ర : అహంకారంకాదు. అవమానం. వెళ్ళడానికేం? వెడతాను. కాని హోటలు యజమాని ఇదివరకే చెప్పాడు, డబ్బిస్తేగాని అన్నం పెట్టనని.
వసంత : నాన్సెన్సు! ఎన్నిగుండెలున్నాయి ఆ మాటనడానికి?
చక్ర : గుండెలుండబట్టే అన్నాడు, పోలీసులకు రిపోర్టు ఇస్తానని. ఇప్పటికిది మూడోవారమని, కావల్సినవన్నీ కమ్మగా మెక్కి డబ్బెగనామంపెట్టామని అధికారిదగ్గర కేసుపెడతాట్ట. పైగా నీవూ నీ అయ్యాగారూ పచ్చి రౌడీలు, శుద్ధ కేడీలు, దేశదిమ్మర్లు, తుంటర్లు, జూదగాళ్లు అని బండబూతులు తిట్టాడు.
వసంత : ఆ తలమాసిన వెధవ బూతులుతిట్టాడు. నీవేమో ఏమీ చేయలేక ఏడుపుమొహం పెట్టావు. పైగా సిగ్గులేక నాతో చెపుతున్నావా అదంతా?
చక్ర : మన వ్యవహారమంతా వివరాలతోసహా పోలీసులముందు పెడతాట్ట. చేతులకు బేడీలు వేయించి జైల్లో కూచోబెడతాట్ట.
వసంత : ఇహ ఆపరా, ఇడియట్! వెళ్ళి భోజనం పంపమను.

చక్ర: అతన్ని పిలుస్తాను, మీరే అడగండి.

వసంత: నేను వాడి మొహంచూడను.

చక్ర: నేనుమాత్రం ఎందుకు చూడాలి?

వసంత: పోరా బైరాగీ! కడుపులో పేగులు అరుస్తున్నాయి.

చక్ర: సరే. [వెడతాడు]

వసంత: ఉన్న డబ్బంతా మన ఆటలకూ పాటలకూ హరించుక పోయింది. ఆ హోటలువెధవ పేకాటలో డబ్బంతా కొట్టేశాడు. ఆట తరువాత ఆట. అరగంట కూచున్నాడో లేదో, సొంతం క్షవరం చేశాడు గాడిదకొడుకు. ఇదొక ముండమోపిఊరు. అప్పిచ్చే షావుకారు ఒక్కడూ కన్పించడు. [అటూ ఇటూ పచారు చేస్తుండగా, చక్రపాణి హోటలు వెయిటర్‌ను వెంటబెట్టుకుని ప్రవేశిస్తాడు.]

వెయిటర్: ఏంసార్! ఏమిటి సంగతి?

వసంత: ఏముంది బ్రదర్? కులాసాగా వున్నావా?

వెయి: కూలాసాకేం సార్! దిలాసాగా వున్నాను.

వసంత: మీ హోటలు బాగా సాగుతోందా?

వెయి: ఓ! బ్రహ్మాండంగా!

వసంత: చూడుబ్రదర్! ఇంతవర కెవరూ భోజనం పట్టాలేదు. నీవైనా కాస్త త్వరగా పంపిద్దూ.

వెయి: లేదుసార్! మా యజమాని మీకు భోజనం పెట్టొ ద్దన్నాడు. పోలీసులకు రిపోర్టు చేస్తాట్ట.

వసంత: చూడుబ్రదర్! కాస్త నీవైనా ఆలోచించు. కడుపులో కాలిపోతోంది. నేనసలే భోజనప్రియుణ్ణి. పస్తు పడుకోమంటే ఎట్లా? చూడు! తిండిలేక ఎలా చిక్కిపోయానో!

వెయి: అవునుసార్! నన్నేం చేయమంటారు?

వసంత: ఒక చిన్నసహాయం చేసిపెట్టాలి. మనల్నిగురించి మీ యజమానికి కాస్త రికమెండ్ చెయ్యాలోయ్! ఘరాటుగా ఒక

లెక్చరు దంచు. అతను అర్థం చేసుకోగలడులే! నాలాగే అతనికీ ఆకలెక్కువ. రోజుకు అయిదారుసార్లు తింటాడు.

వెయి: సరే సార్! చెప్పి చూస్తాను. [వెయిటరు, చక్రపాణి క్రిందికి వెళతారు]

వసంత: ఈ హోటలు ముండాకొడుకు శనిగ్రహంలా పట్టుకున్నాడు. కడుపులో ఇంత మంట ఎప్పుడూ ఎరగను.

[చక్రపాణి తిరిగి ప్రవేశిస్తాడు]

చక్ర: భోజనం తెస్తున్నాడు.

వసంత: [చప్పట్లు కొడుతూ ఎగిరి కుర్చీలో కూచుంటాడు.] గ్రాండ్! భోజనం, భోజనం! [లల్లబీ పాడుతూ ఈలవేస్తూ కూచుంటాడు వెయిటర్ భోజనపదార్థాలతో ప్రవేశిస్తాడు.]

వెయి: ఇదే ఆఖరుసారి సార్! చెప్పమన్నాడు యజమాని.

వసంత: యజమాని, యజమాని! నీవూ, నీ యజమాని కలిసి ఆ కృష్ణలో దూకండి. ఏం తెచ్చావు అన్నంలోకి?

వెయి: పులుసు, వంకాయకూర.

వసంత: రెండేనా?

వెయి: అంతే.

వసంత: నీ భోజనం పాడుగాను. ఎలా తినాలి? వెళ్లి చెప్పు. ఇవి చాలవు. ఇంకేమైనా కూర పంపమని చెప్పు.

వెయి: ఇంకేమీ లేదని చెప్పాడు యజమాని.

వసంత: క్యాబేజీ వండలా?

వెయి: లేదు.

వసంత: క్యారెట్టు?

వెయి: ఊహుఁ!

వసంత: బంగాళ దుంపల కూర?

వెయి: లేదుసార్!

వసంత: ఏదడిగినా లేదూ లేదు. ఎందుకు లేదు? నేను చూళ్లే దనుకున్నావా? కింద భోంచేసేవాళ్ళ విస్తళ్లలో నాలుగు కూర

లున్నాయి. వంటింట్లో పళ్ళాలనిండా రకరకాల పదార్థా లున్నాయి.

వెయి : [వినుగ్గా] ఉన్నాయి, లేవు. అదంతా ఎందుకుసార్? మీకు మాత్రం లేవు.

వసంత : నాకెందుకు లేవు?

వెయి : మీరు డబ్బివ్వలేదుకనుక. డబ్బిచ్చినవాళ్ళకే మంచి భోజనం వస్తుంది.

వసంత : షటప్ యూ ఫూల్!

వెయి : అవునుసార్!

వసంత : [ఆవురావురున అన్నం తింటూ] రాస్కెల్, ఇడియట్, రోగ్! వాళ్ళకున్నాయట, నాకు లేవట. ఎందుకని? అందరిలాంటివాణ్ణి కాదు నేను?

వెయి : అవునుసార్! వాళ్ళు డబ్బిచ్చారు, మీరివ్వలేదు.

వసంత : షటప్! [పులుసు పోసుకుంటూ] ఇది పులుసా, సాంబారా?

వెయి : అదేపులుసు, అదేసాంబారు. అంతా అదే.

వసంత : ఏం పులుసిది? వట్టి నీళ్లు. మంచి సాంబారు పట్రా. ముక్కలుకూడా మరిన్ని వేసి తీసుకరా.

వెయి : ఉన్నదది. ఇష్టమైతే తినండి, లేకపోతే లేదు; అంతే. యజమానిచెప్పాడు.

వసంత : యజమాని, యజమాని. శనిగ్రహం! ఛీ ఛీ! ఈ పాడు కూడు ఎట్లాతినాలి? [అలాగే తింటుంటాడు] ఇది వంకాయకూరా, మరేమన్నానా?

వెయి : వంకాయే సార్!

వసంత : ఛీ! నీ తలకాయ! వంకాయకాదు, పాడుగాదు.

వెయి : ఏమిటంటారు మరి?

వసంత : ఏమో ఎవడికి తెలుసు? వంకాయమాత్రం కాదు. ఏదో గడ్డీ గాదం పడేశావు. సరే, పెరుగు పట్రా.

నెయి : పెరుగు పొద్దున్నే అయిపోయింది సార్ !

వసంత : [ఎగాదిగా చూచి] పోనీ, మజ్జిగ పట్రా.

నెయి : అదీ అయిపోయింది.

వసంత : [అమాంతంగా లేచి, అతనిమీద విరుచుకు పడతాడు] యూ స్కౌండ్రల్ ! అయిపోయింది, అయిపోయింది ! అంతా అయి పోయింది. ఇక్కడ నా ప్రాణంకూడా పోయింది. [నెయిబురు భయపడి పారిపోతాడు. చక్రపాణికూడా క్రిందికి జెడతాడు. వసంతకుమార్, చేయి కడుక్కొని] ఛీ ! అన్నం తిన్నట్లులేదు. డబ్బుంటే బజారెళ్లి ఏదైనా కొనుక్కుతిందును.

[ చక్రపాణి మళ్ళీ ఆదుర్దాగా ప్రవేశిస్తాడు ]

చక్ర : [గాభరాగా] ఎవరో అధికారి మీ కోసం కింద అడుగు తున్నాడు.

వసంత : [భయంతో] ఏమిటీ? ఆఫీసర్ ? ఆహోటలువాడు నామీద రిపోర్టుచేశాడు కాబోలురా దేవుడా ! రాస్కెల్ ! నన్ను జైలుకు పంపిస్తాడా ? వాళ్ళునన్ను మర్యాదగా చూస్తే సరిపోతుంది. లేకపోతే...వీల్లేదు. నే వెళ్ళను. వీధిలో అనేకమంది వుంటారు. పదిమందిలో పరువుపోతుంది. ఆ ఎదురింటి అమ్మాయి అస్తమానం నాకోసం వాకిట్లో కూచుంటుంది. నన్ను చూచి ఏమనుకుంటుంది? ఏమైనాసరే ఇక్కణ్ణుంచి వెళ్ళను. ఆఫీసరెవడు నన్ను పొమ్మనటానికి ? ఎంతధైర్యం? నేనేం కూలివాణ్ణనుకున్నాడా ? రానీ చెప్తాను. వెళ్ళమనడానికి అతనెవరు ! ఎన్ని గుండెలున్నాయి ? నిలబెట్టి అడుగుతాను [తలుపు చప్పుడవుతుంది. వసంతకుమార్ కంఠం సన్నగిలుతుంది. గదిలో దాక్కోడానికి ప్రయత్నిస్తాడు. కాని సాధ్యంకాదు. చైనులు ప్రవేశిస్తాడు. వసంతకుమార్‌నుచూచి ఆగిపోతాడు. ఇద్దరూ భయపడతారు. నిశ్చేష్టులై ప్రతిమల్లా ఒకరి నొకరు చూచుకుంటారు. కొద్దిక్షణాలు నిశ్శబ్దం. చైనులు మొట్టమొదట తెప్పరిల్లుకుంటాడు. తను ఊహిస్తున్న పైఆఫీసరుసమక్షంలో వినయ విధేయతలతో నిలుచుంటాడు]

చైనులు : నమస్కారం. ఈ శుభోదయాన తమ దర్శనభాగ్యం లభించినందుకు వందన సహస్రాలు. [ధనియాలు, మెల్లగా లోపలికి వస్తాడు]

వసంత : (మెల్లగా, డిగ్నిఫైడ్‌గా) నమస్కారం.

చైనులు : నా రాకవల్ల తమ కార్యానికి ఏదైనా భంగం కలిగితే క్షమించండి.

వసంత : భంగమా ? నేనేమీ పనిచేయడం లేదే !

చైనులు : ఈ ప్రాంతానికి పెద్ద ఉద్యోగినవడంవల్ల ప్రయాణీకులకు, తమవంటి గొప్పవాళ్ళకు, ఏ ఇబ్బందీ కలగకుండా చూడాల్సిన బాధ్యత నామీద వుంది.

వసంత : [మొదట్లో ఏదో గొణిగి తరువాత పెద్దగా] అందుకు నన్నేం చేయమంటారు ? నేనేం తప్పుచేయలేదు. ఇవ్వాల్సింది ఇస్తాను. [మిరియాలు, తలుపుసందుల్లోంచి తొంగి చూస్తుంటాడు] తప్పంతా ఆ హోటలు వాడిది. అన్నంలోకి కూరలేదు. సాంబారడిగితే నీళ్లు పోస్తాడు. పెరుగడిగితే లేదంటాడు. నోట పెట్టడానికి వీల్లేదు. [అన్నపు గిన్నెలవైపు చూపుతూ] రోజూ కిటికీలోంచి అవతల పారేస్తున్నా. ఉపవాసం చెయ్యనిరోజులేదు. కాఫీ కషాయంలా వుంటుంది. టీ తాగితే నోరు తిమ్మిరెక్కుతుంది. అన్నీ అధ్వాన్నంగా వున్నాయి. పైగా నే నెందుకు వెళ్ళిపోవాలి ?

చైనులు : [భయంతో] మన్నించండి ! ఇలా జరిగినందుకు చాలా విచారిస్తున్నాను. నిజంగా ఇందులో నా పొరపాటు ఏమీలేదు. ఈ ప్రాంతం కూరగాయలకు ప్రసిద్ధి; కల్తీలేని సరుకులు దొరుకుతాయి. వర్తకులు నీతిపరులు, నిజాయితీగా వుంటారు. మరి ఆ హోటలువాడు ఇలాంటి సరుకు ఎక్కడపట్టు కొచ్చాడో తెలీదు. తమ కిక్కడ సదుపాయంగా లేదు కాబట్టి, మరో చోటుకు మకాం మార్చాలని నా విన్నపం.

వసంత : No, నే వెళ్ళను మీరు రమ్మనేది ఎక్కడికో నాకు తెలుసు. జైలుకు. మరోచోటంటే అర్థం అదే! మీకు ఏం అధికార ముంది? నేను...నేను గవర్నమెంటు ఉద్యోగిని రాజధాని నగరంనుండి వచ్చాను. [ధైర్యం తెచ్చుకుంటూ] నన్నామాట అనడానికి ఎన్నిదమ్ములున్నాయి? మీరు పోలీసుల్ని తెచ్చినా నేను భయపడను. సరాసరి గవర్నరు దగ్గిరికెళ్ళి మాట్లాడతాను మీరు...మీరు...[బల్లమీద, పిడికిలితో గుద్దుతాడు]

చైనులు: [వణికిపోతూ, చేతులు నలుపుకుంటూ మాట్లాడుతాడు] క్షమించండి! నన్ను దయతలచండి! నా జీవితాన్ని నాశనం చేయకండి భార్యాబిడ్డలు కలవాణ్ణి, నా సంసారం కూలిపోతుంది.

వసంత: వీల్లేదు. యిక్కడనుంచి వెళ్ళను. ఏం పన్నుగడ? మీ భార్యా బిడ్డలకోసం నేను జైలుకువెళ్ళాలా? ఏం ఎత్తు?

[మిరియాలు తలుపు సందుల్లోంచి తొంగిచూచి భయంతో వెనక్కుపోతాడు]

చైనులు : [వణుకుతూ] నా కనుభవం తక్కువ. అంచేత అలా జరిగింది. దేవుడిమీద ప్రమాణంచేసి చెపుతున్నాను. అంతకన్నా మరేంకాదు ముష్టివాడిలా బ్రతుకుతున్నాను. నాకొచ్చేజీతం కాఫీపొడికి, పంచదారకు చాలదు; నేను లంచాలు తీసుకునేవాణ్ణి కాదు. ఎప్పుడైనా ఒక చొక్కాగుడ్డ, ఒక టేబులు క్లాత్ అంతే! పోతే కానిస్టేబుల్ భార్యను నేనేం కొట్టించలేదు. అంతా అబద్ధం గిట్టనివాళ్ళు కల్పించారు. ఉద్యోగంలో నా తల నెరసిపోయింది. ఈ ప్రాంతానికి నా జీవితం ధారపోశాను. నాకో క్షణంకూడా మనశ్శాంతిలేదు. ఇంత సేవచేస్తున్నా, రోజూ నన్ను చంపడానికి ఎవరో ఒకరు కుట్రపన్నుతూనే వున్నారు.

వసంత : మీరు చెప్పే విషయాలతో నాకు సంబంధం లేదు. [A Pause] అసలీ సోదంతా ఎవరు చెప్పమన్నారు? విరోధులు మీ మీద కుట్రలు పన్నుతున్నారో, మీరు కానిస్టేబులు భార్యను తన్నించారో, అదంతా నా కనవసరం. ఇప్పుడుమాత్రం

నా మీద దండయాత్ర చేస్తున్నారు. ఇస్తాను. డబ్బు రాగానే అవతల పారేస్తాను. అప్పటిదాకా ఇక్కడుండాల్సిందే. ప్రస్తుతం నా దగ్గర ఒక కానీకూడా లేదు.

చైనులు: తమకు డబ్బుకు ఇబ్బందిగా వుంటే తీసుకోండి. కావల్సినంత వాడుకోండి. ఏంకావాలన్నా చేయడానికి తమ సేవకుడు సిద్ధంగా వున్నాడు. ఇక్కడికి వచ్చినవాళ్ళను తగురీతిగా, సత్కరించి, వాళ్ళకు సహాయం చేయడమే నా పని.

వసంత: అవునవును. కాస్త అప్పుపెట్టండి, ముందా హోటలువాడికి పారెయ్యాలి. రెండొందలైతే సరిపోతాయి. కాస్త తక్కువైనా ఫరవాలేదు.

చైనులు: [ధనియాలుతో సైగచేసి అతని దగ్గర్నుంచి నాలుగొందలు తీసుకుంటాడు. నోట్లు అందిస్తూ] సరీగా రెండువందల రూపాయలు. తమకు లెక్కపెట్టాల్సిన అవసరంలేదు. [రెండొందల బదులు నాలుగొందలు ఇచ్చానని సంతోషిస్తాడు]

వసంత: [డబ్బు తీసుకుంటూ] థ్యాంక్సు. నేను మా ఊరు వెళ్ళగానే మీ డబ్బు పంపిస్తాను. మీరు చాల మర్యాదస్తుల్లా వున్నారు. [చక్రపాణితో] చక్రపాణీ! ఆ వెయిటర్‌ను పిలువు. [చక్రపాణి వెడతాడు] [వసంతకుమార్, చైనుల్ని, ధనియాలును ఉద్దేశిస్తూ] మీరింకా నిలబడే వున్నారు. దయచేసి కూర్చోండి. [ధనియాలుతో] మీరు కూర్చోండి. [మొదట్లో కొంచెం సందేహించి ఆ తరువాత ఇద్దరూ కూచుంటారు] ఇప్పుడు నిజంగా మీ మనసు అర్థంచేసుకోగలిగాను. మీ మర్యాద, మంచితనం నాకు నచ్చాయి. నిజంచెపుతున్నాను. మొదట్లో ఏమనుకున్నానో తెలుసా? మీరు నన్ను ... [ధనియాలు కుర్చీలోంచి లేస్తాడు] కూచోండి [మిరియాలు తలుపుసందులోంచి చూస్తుంటాడు]

చైనులు: [ఇంకా ఆఫీసరు ప్రచ్ఛన్నంగావుండి, విషయం మరుగుపరుస్తున్నాడని భావిస్తాడు. తనకూడా విషయం తెలీనట్లే నటిస్తాడు] [ధనియాలును

చూపుతూ] ఇతను ఈ ఊరిసావుకారు. పేరు ధనియాలు ఇతన్ని వెంటతీసుకుని ప్ల్యాటీమీద బయలుదేరాను, హోటల్లో ప్రయాణీకుల్ని ఎలా సత్కరిస్తున్నారో తెలుసుకుందామని. నేను అందరిలాంటి వాణ్ణికాదు. ఉద్యోగస్థులు సాధారణంగా ఇలాంటి విషయాలు పట్టించుకోరు. నేను మాత్రం ఇలాంటి విషయాలే అతిముఖ్యంగా పాటిస్తాను. ఇక్కడికి కొచ్చిన ప్రతివారూ సరీగా సత్కారం పొందేలా చూడడమే నా ఆశయం. అది నాకెంతో హాయినిస్తుంది. ఇవాళ తమవంటి పెద్దలసేవచేసే అవకాశం కలిగినందుకు నా కెంతో ఆనందంగా వుంది.

వసంత: అవును. నాకూడా అలాగేవుంది. ఇప్పుడు మీరే కనుక తటస్థించకపోతే, నే నిక్కడ ఎంతోకాలం ఉండాల్సి వచ్చేది. నా అప్పులు పరిష్కారం చేసే మార్గం దొరికేది కాదు.

చైనులు: [మెల్లగా గుట్టు, గుంజుదామని] తమ రెందాకా వెడుతున్నారో అడగొచ్చా?

వసంత: నేను మా ఊరు వెడుతున్నాను.

చైనులు: బాగుంది. ప్రయాణం అన్న తరవాత కొంతకష్టం, కొంత సుఖం వుండకపోదు. బస్సులైక, బళ్లు దొరక్క ఆలస్యంగా అంచలమీద ప్రయాణం చేయాల్సివస్తుంది. సాధక బాధకాలున్నా స్వగ్రామం వెళ్ళడంసరదాగానే వుంటుంది. (a pause) తమరక్కడ కులాసాగా గడపడం కోసం వెడుతున్నారనుకుంటా?

వసంత: కాదు. మా నాన్నగారు కబురుచేశారు. నా కింకా ఉద్యోగంలో ప్రమోషన్ రాలేదని ఆయనబాధ. కాని ఢిల్లీలో నాఆఫీసు బాధ్యతలు, నేనుపడే శ్రమలు ఆయన కేం తెలుస్తాయి?

చైనులు: తమకు స్వగ్రామంలో చాలరోజులు మకాం చేస్తారా?

వసంత: ఏమో చెప్పలేను. మా తండ్రిగారు వృద్ధాప్యంలో వున్నారు. ఆయనకు చాదస్తం పట్టుకుంది. చెపితే వినడు. నేనా పల్లెటూళ్లో రైతులమధ్య ఒక్క క్షణంకూడావుండలేను. ఢిల్లీవదలి

పెట్టాలంటే ప్రాణం తల్లడిల్లుతుంది. గొప్పవారితో తిరుగుతూ గొప్పగొప్ప విషయాలు ఆలోచించేవాణ్ణి. ఎప్పుడూ జీవితంలో ఆదర్శాలకోసం అన్వేషించేవాణ్ణి. అలాంటివాడికి ఆ పల్లె కొంపల్లో ఏం తోస్తుంది. అక్కడ పడుండి నా జీవితం పాడుచేసుకోవడం ఇష్టం లేదు.

చైనులు : యథార్థం సెలవిచ్చారు. తమరన్నట్లు ఈ పల్లెకొంపల్లో జీవితమేముంది ? నేనున్నాను చూడండి, కడుపునిండా తిండిలేదు. కంటిమీద కునుకులేదు. ఉద్యోగంలో దేశసేవలో తల నెరిసిపోయింది. ఎన్నెన్నో ఊహలతో, ఎన్నెన్నో ఆశలతో ప్రజాసేవ చేశాను. కాని ఎంతచేసినా ఫలితం కనపడదు, పదవీ, ప్రతిష్ఠ ఎప్పటికొస్తాయో చెప్పలేం. [గది అంతా కలియచూస్తూ] గది చాల చిన్నదిగావుందే. కావల్సినన్ని బల్లలు, కుర్చీలు కూడా లేవు.

వసంత : బల్లలు లేకపోతే మానేరు, నల్లులు మాత్రం సమృద్ధిగా వున్నాయి. అంతలావు నల్లుల్ని నా జన్మలో చూల్లేదు !

చైనులు : తమవంటివారిలా బాధపడడం ఏమాత్రం బాగులేదు, పైగా గదంతా చీకటిగా వుంది.

వసంత : అవును. పగలే లైటు పెట్టుకోవాలి. నాకు పుస్తకాలు చదువుకునే అలవాటు. ఎంతో రాసుకోవాల్సిన పనికూడా వుంది. ఏంచేయను? ఆ హోటలువాడు లాంతరుకూడా ఇవ్వందే!

చైనులు : తమ సెలవైతే......[ఏదో చెప్పబోయి సందేహిస్తాడు ]

వసంత : ఏమిటి సెలవైతే ?

చైనులు : వద్దులెండి. నేనందుకు అనర్హుణ్ణి.

వసంత : ఏమిటది చెప్పండి ?

చైనులు : వద్దు వద్దు. తమను అడగడానికి నోరురావడంలేదు.

వసంత : ఫరవాలేదు చెప్పండి.

చైనులు : ఏంలేదు. తమరు అనుగ్రహిస్తే మా ఇంట్లో బసఏర్పాటు చేస్తాను. ఇల్లు విశాలంగా వుంటుంది. చక్కటిగది. మంచిగాలి, వెలుతురు - తమకు అన్నీ అమరుతాయి. ఇలా అడిగినందుకు ఆగ్రహించకండి. అన్యథా భావించకండి. నా మనస్సు వెన్న లాంటిది. ఇతర్లు కష్టపడుతుంటే చూచి ఓర్చుకోలేను. నేనే కాదు. నాభార్యకూడా అంతే. అతిథిసత్కారమంటే ఆమె కెంతో ఇష్టం. మనస్ఫూర్తిగా తమర్ని మా ఇంటికి ఆహ్వా నిస్తున్నాను.

వసంత : ఈపాటి దానికేనా ఇంత చెప్పారు! కోపమెందుకు? పైగా ఆనందంకూడాను. నా కసలు ఇంటిపట్టునవుండే అలవాటు. హాయిగా ఫీలవుతాను. ఈ మురికి కూపంకంటే అక్కడే హాయిగా వుంటుంది.

చైనులు : ధన్యుణ్ణి ముఖ్యంగా నా భార్య ఎంతో సంతోషిస్తుంది. మా ఇంట్లో అందరూఅంతే. మాస్వభావమే అది. ఏదైనాపుటకతో రావాలిగాని, తెచ్చుకుంటే వస్తుందా! అతిథిని సత్కరించడ మంటే మాకెంతో సరదా. అందులో తమవంటి వారికి ఆతిథ్యం ఇవ్వడం మా పూర్వజన్మ సుకృతం. నన్ను నేనుపొగడు కుంటున్నాననుకోకండి. మనసువిప్పి మాట్లాడుతున్నాను.

వసంత : నేనూ అంతే. మనసులో ఒకటుంచుకుని బయటికిమరొకటి మాట్లాడే వాళ్ళను చూస్తే నాకు వళ్లు మండుకొస్తుంది. మీ ఆప్యాయత, ఆదరణ నాకు నచ్చాయి. నేను మీకు రుణపడి వున్నాను. కాని ఒకటి మాత్రం చెప్పగలను. ఇతర్లనుండి చిన్న మెత్తయినా ఆశించేవాణ్ణి కాదు నేను వాళ్ళప్రేమ,ఆదరణవుంటే చాలు.

[చక్రపాణి, వెయిటర్‌తో ప్రవేశిస్తాడు]

వెయిటర్ : తమరు పిలిపించారా అయ్యగారూ?

వసంత : అవును. బిల్లు పట్టా.

వెయిటర్ : పొద్దున తమకే ఇచ్చానే!

వసంత : నీ వెధవ బిల్లులన్నీ చూడ్డానికి నాకు తీరికలేదు. ఎంతయిందో చెప్పు.

వెయిటర్ : మొదటిరోజు భోంచేశారు, రెండోరోజు పాలు తీసుకున్నారు......

వసంత : యూ ఇడియట్! అవన్నీ అనవసరం. నేను నీకు ఎంత డబ్బివ్వాలో చెప్పు.

చైనులు : తమకెందుకు ఆ శ్రమ? అదంతా మాకు వదిలేయండి. [వెయిటరుతో] ఏయ్, వెయిటర్! మీ యజమానితో చెప్పు కొంచెం ఆగమని. మీ బిల్లులన్నీ నేనే పరిష్కారం చేస్తాను.

వసంత : [డబ్బు జేబులో పెట్టుకుంటూ] అలా చేయండి. సరిపోతుంది.

వెయిటర్ : చిత్తం. [వెళ్ళిపోతాడు]

చైనులు : మా ఊళ్లో ప్రయివేటు సంస్థలు, పబ్లికుసంస్థలు అనేకం వున్నాయి. తమరు దర్శించాలనుకుంటున్నారా?

వసంత : [అర్థం కాక] అంటే...?

చైనులు : ఈ ఊళ్ళో వ్యవహారాలు ఎలా వుంటాయో చూద్దురుగాని. మేము అన్నీ ఎంతో జాగ్రత్తగా వుంచుతాం.

వసంత : ఓ యస్. మీ రెక్కడికి రమ్మంటే అక్కడికి వొస్తాను. [మిరియాలు తొంగి జూస్తాడు.]

చైనులు : తమ రిష్టపడితే ఇక్కణ్ణుంచి సరాసరి హైస్కూలుకు వెడదాం. పిల్లలకు విద్యాబోధన ఎలా జరుగుతూవుందో చూద్దురుగాని.

వసంత : తప్పకుండా.

చైనులు : అక్కణ్ణుంచి పోలీసుస్టేషనుకు, సబ్‌జైలుకు వెడదాం. నేరస్థుల్ని ఎలా విచారిస్తున్నదీ పరిశీలిద్దురుగాని.

వసంత : [సందేహిస్తూ] సబ్‌జైలెందుకూ? ముందు ధర్మ సంస్థలను దర్శిద్దాం.

చైనులు : తమ చిత్తమొచ్చినట్లే చేద్దాం. తమరు స్వంతకార్లో వస్తారా లేక మా టాక్సీలో వెడదామా ?

వసంత : మీ టాక్సీలోనే వెడదాం.

చైనులు : [ధనియాలుతో] ధనియాలూ ! నీకు టాక్సీలో జాగా వుండదు.

ధని : ఫరవాలేదులెండి కారువెనకాల పరుగెడతాను.

చైనులు : [మెల్లగా] అలా కాదు. నీకు రెండుచీట్లు ఇస్తాను. ముందు వెళ్ళి ఒకటి ఆసుపత్రిలో ఇవ్వు. రెండోది మా ఇంట్లో ఇవ్వు. [వసంతకుమార్‌తో] నా భార్యకు రెండుముక్కలు చీటీ వ్రాస్తాను. వంటా అదీ ఏర్పాటుచేయమని తమ ఆజ్ఞ అయితే...

వసంత : ఓ యస్ ! కలం ఇక్కడుంది. కాగితం లేదే. పోనీ ఈబిల్లు వెనకాల వ్రాయండి. [జేబులోంచి బిల్లు తీసియిస్తాడు]

చైనులు : చిత్తం. ఇది సరిపోతుందిలెండి. [కాగితం రెండు ప్రక్కలా ఉత్తరంవ్రాసి ధనియాలు కిస్తాడు. ధనియాలు బయటికి వెడుతూ తలుపు తోస్తాడు. మిరియాలు తలుపు తట్టుకుని క్రిందపడతాడు. ముక్కుమీద చిన్న దెబ్బ తగులుతుంది.]

వసంత : [మిరియాలును సమీపించి] దెబ్బ తగిలిందా ?

మిరి : ఏమాత్రం తగల్లేదు. తమరీ వేధననుగురించి విచారించకండి. ఏదో కాస్త ముక్కుమీద గీరుకపోయింది. అంతే డాక్టరు పట్టీ వేస్తాడు. క్షణంలో పోతుంది.

చైనులు : [వసంతకుమార్‌తో] అదేమంత ప్రమాదంలేదులెండి. ఇహ మనం వెడదామా ? తమ సామాను మనిషిద్వారా పంపిద్దాం. [చక్రపాణితో] ఆ సామాను కూలివాడిచేత మా ఇంటికి పట్టించుకెళ్ళు నాయనా ! మా ఇల్లు, చైనులుగారిల్లు ఎవరి నడిగినా చెప్తారు. [నడుస్తూ వసంతకుమార్‌తో] అహా ! దయచేసి ముందు తమరు పదండి. నేను తమ వెనుక వుంటాను. [వసంతకుమార్

వెడతాడు. చక్రపాణికూడా బయటికి వెడతాడు. అప్పుడు చైనులు మిరియాలును సమీపించి] అసలు నిన్నెవరు రమ్మన్నా రిక్కడికి? నీ పాడు సర్కస్‌ఫీట్లన్నీ ఎక్కడైనా ఏడవలేకపోయావా? దరిద్రపు వెధవ!

[ చైనులు చివరి మాటలు అంటూ వుండగా తెర ]

# మూడో రంగము

[మొదటి దృశ్యంలో మాదిరిగానే చైనులు ఇంట్లో ముందరి గది. అదే రోజు మధ్యాహ్నం చైనులు భార్య కోమలమ్మ, కూతురు తిలకమ్మ, ఒకటో దృశ్యంలో లాగానే కిటికీ దగ్గర నిలబడి వీధిలోకి చూస్తుంటారు]

కోమ: [చిరాగ్గా] చూసీ చూసీ కళ్ళు కాయలుకాశాయి. గంట యింది కానుకకూచుని. నీ వేమో మూడు గంటలు ముందు గానే ముస్తాబై కూచున్నావు. వాళ్ళు ఇంతవరకు అతీగతీలేదు. రోడ్డుమీద పుట్ట పురుగు కన్పించడం లేదు. నాకు తలనొప్పి వస్తోంది. ఎప్పటికి కొస్తారో, ఏం చస్తారో?

తిల: రెండు నిముషాల్లో అంతా తెలుస్తుందే అమ్మా! జవానీపాటికి వస్తూవుంటాడు. [A pause] అమ్మా, అమ్మా! ఆ వచ్చే దెవరో చూడు.

కోమ: ఎవరొస్తున్నారు? నీవు ఊరికనే ఉలిక్కిపడుతుంటావు. [వీధిలోకి చూస్తూ] అవునేవ్. నిజంగా ఎవరో వస్తున్నట్లుంది. ఎవరబ్బా? ఏమో నా పిండాకూడు! ఎవరైందీ తెలీడంలేదు.

తిల: ఆ వచ్చేది ధనియాలే అమ్మా.

కోమ: అత నెందు కొస్తా డిప్పుడు? నీ కెప్పుడూ వాడి ధ్యాసే.

తిల: నిజంగానే అమ్మా! ఆ రంగుచొక్కా చూడు. అతను ధనియాలే. పరుగెత్తుకుంటూ వస్తున్నాడు.

కోమ: నీకున్న రోగం ఇదే! నేనవునన్నది నీవు కాదంటావు. ఆ వచ్చేది ధనియాలుమాత్రం కాదు.

తిల: ఈసారి చూడు! ఇంకా దగ్గరి కొచ్చాడు.

కోమ: నిజమేనేవ్! ధనియాలే! [కిటికీలోంచి చేతులూపుతూ] రా! త్వరగా రా! ఎక్కడున్నారు వాళ్లు? ఆ! చెప్పవేం? మీ అయ్యగా

రెక్కడున్నారు? మావాళ్ళు కన్పించలా? ఏంజరిగిందో చెప్పరా మొద్దూ!

[ధనియాలు గసపెట్టుకుంటూ ప్రవేశిస్తాడు]

భలే పెద్దమనిషివి! నిన్ను నమ్ముకుంటే బాగానే చేశావు. అంతూ పంతూ లేకుండా పోయావేం? మే మిక్కడ ఏసంగతీ తెలీక చస్తున్నాం.

ధని: నేను గుర్రబ్బండిలా పరుగెత్తాను. ఊపిరి సలపడంలేదు. [తిలకమ్మవైపు వారగంట చూస్తూ] ఏం తిలకమ్మా? బాగున్నావా? పూలజడ వేశావే?

తిల: ఆ! బాగానేవున్నాను. మా అమ్మ కూచోపెట్టి పూలజడ వేసింది.

కోమ: [విసుగ్గా, ధనియాలుతో] అది సరే. అక్కడేం జరిగిందో చెప్పు.

ధని: గురువుగారు మీకీ చీటీ ఇమ్మన్నారు. [చీటీ ఇస్తాడు.]

కోమ: [తీసుకుంటూ] అసలా వచ్చిందెవరు? ఆఫీసరేనా?

ధని: ఆ! ఆఫీసరులా కనిపించడు. కాని ఆఫీసరు అమ్మ మొగుడులా వున్నాడు. ఆ మాట, ఆ నడక, ఆ ఠీవి, ఆ విజ్ఞానం! ఓ! ఏం బుర్ర!

కోమ: ఢిల్లీనుంచి మా తమ్ముడు ఉత్తరంలో వ్రాసిన ఆఫీసరేనా?

ధని: ఆ! అచ్చంగా ఆయనే, నేను గుర్తుపట్టిన మనిషే. నేనూ, మిరియాలు.

కోమ: అయితే అక్కడ ఏం జరిగిందో వివరంగా చెప్పు

ధని: అంతా సరిగానే జరిగింది. మొదట్లో ఆఫీసరు, గురువుగార్ని చూచి ఆందోళనపడ్డాడు. అవును. ఆయన కోపంలో వున్నాడు. హోటల్లో అంతా అసహ్యంగా వుందనీ, అందుకోసం తాను జైలు కెళ్లాల్సిన అవసరం లేదనీ కసురుకున్నాడు. కాని గురువు గారు నెమ్మదిగా మాటల్లోకి దింపి మచ్చిక చేసుకున్నారు. ఆ

తరువాత ఆఫీసరు ఐస్, కూల్‌డ్రింక్ అయిపోయినాడు. అంతా సక్రమంగా జరిగిపోయింది.

కోమ: [ఊపిరి పీలుస్తూ] అమ్మయ్య! ఇప్పటికి నా మనసు కుదుట పడింది. [పటానికి నమస్కరిస్తూ] ఏడుకొండలవాడా! వెంకట రమణా! అంతా నీచలవేనయ్యా! [ధనియాలుతో] ఆ! తరువాత?

ధని: ఆసుపత్రి చూడ్డానికి వెళ్ళారు. మొదట్లో గురువుగారు తన మీద ఎవరో రిపోర్టిచ్చాడని భయపడ్డారు. నాక్కూడా వళ్లు వణుకు పుట్టింది.

కోమ: నీ కెందుకు భయం? నీ వేం గవర్నమెంటు నౌకరువా యేం?

ధని: కాకపోతే ఏమండీ! అంతటి మహానుభావుడు మాట్లాడుతూ వుంటే, ఎవడికైనా భూమిమీద కాలు ఆనుతుందా?

కోమ: అది సరేగాని, నాకో విషయం చెప్పు. అస లాయన ఎట్లా వుంటాడు? ముసలివాడా? పడుచువాడా?

ధని: వయసు కుర్రాడు. లేత వంకాయలా వున్నాడు. ఇరవై మూడేండ్లుంటాయేమో! కాని మాటలు ఎలా వుంటాయను కున్నారు? ఎంతో అనుభవజ్ఞుడిలా, అన్నీ కాచివడపోసినవాడిలా మాట్లాడతాడు. వయసు చిన్నది, బుర్ర పెద్దది. ఏం ఠీవి, ఏం దర్జా! మొహాన రాజకళ ఉట్టిపడుతోందనుకోండి. ఆకారానికి మన్మథుడే! 'ఎన్నో గ్రంథాలు చదువుకుంటాను. బోలెడు రాసుకోవాల్సిన పనుంది' అన్నా డాయన. [అభినయిస్తాడు]

కోమ: ఎర్రగా వుంటాడా? నల్లగా వుంటాడా?

ధని: ఆ రెండూ కాదు. పచ్చగా, పసుపుకొమ్ములా దబ్బపండులా, బంగారుముద్దలా, నిగనిగా, ధగధగా మెరుస్తుంటాడు. అతని చూపులు మన్మథుడి తూపుల్లా గుచ్చుకుంటాయి

కోమ: సరే ఈ చీటీ ఏమిటో చూద్దాం. [చదువుతూ] 'నా పరిస్థితి భయంకరంగావుంది. దేవుడిదయ ఎలావుందో తెలీదు. కాఫీ,

టిఫిన్ రూపాయి తొమ్మిది అణాలన్నర' [చదవడం ఆపి] ఈ పద్దు లేమిటి మధ్యలో ?

ధని : కాగితం దొరక్క బిల్లుమీద రాశాను. తిప్పి చదవండి.

కోమ : [కాగితం తిప్పిచదువుతూ] 'దేవుడిదయ ఎలావుందో తెలీదు. వెంటనే వంట తయారుచేయించు. ఎక్కువ శ్రమతీసుకోవద్దు. మామూలు భోజనం. ఆఫీసరు మన ఇంట్లోనే మకాం. గదిలో సామానంతా సర్దించు. ముఖ్యమైనది. తక్షణం మన జవాన్ని దుర్గయ్య ఇంటికి పంపు. నేను తెమ్మన్నానని చెప్పి ఒకటోరకం బ్రాందీ సమృద్ధిగా తెప్పించు. సరుకు మంచిది కాకపోతే, వాడి గుడిసె పీకిస్తానని చెప్పు. అర్జంటు. ఇంతే సంగతులు. నీకు నా ముద్దులు. ఇట్లు, నీ మొగుడు.' [పూర్తిచేసి] హరిహరామ ! ఇహ కాలు ఒకచోట పెట్టడానికి వీల్లేదు. ఎవరక్కడ? సుబ్బన్నా! సుబ్బన్నా ! [నౌకరు సుబ్బన్న వస్తాడు] ఇదిగో ! దుర్గయ్య ఇంటికి పరుగెత్తు. ఉండుండు ! చీటీ ఇస్తాను. [బిల్లమీద కాగితం, కలం తీసు కొని చీటీ వ్రాస్తుంది] ఈ చీటీ మన జవానుకు ఇచ్చి త్వరగా బ్రాందీ తీసుకరమ్మను. నీవు వెళ్ళి మన మధ్యగదిలో సామానంతా సర్ది శుభ్రంచేయి. ఊ ! త్వరగా ! అడుగులో అడుగు వేయక. గదంతా క్లీన్‌గా వుండాలి. ఆ గదిలో ఆఫీసరుంటాడు. వేడినీళ్ళు, సబ్బులు, టవల్సు అన్నీ జాగ్రత్తగా అమర్చు. పెద్దమంచంవేసి దాని మీద పట్టుపరుపు వేయి. టేబులుక్లాత్ కొత్తది పరువు. ఊ ! త్వరగా !

[తరుముతూ మాట్లాడుతుంది. సుబ్బన్న బయటికి వెడతాడు]

ధని : కోమలమ్మగారూ ! ఇహ నే వెడతాను. ఆసుపత్రిలో తనిఖీ జరుగుతోంది.

కోమ : వెళ్ళు, వెళ్ళు ! ముచ్చట్లకిది సమయం కాదు ! [ధనియాలు వెడతాడు. అప్పుడు కోమలమ్మ, కూతురుతో] తిలకం ! ఇప్పుడు మనం ఆలోచించాలి. ఏంబట్టలు కట్టుకుంటే బాగుంటుంది? అసలే

పట్నంపిస్తే. అందులో కుర్రాడు. మన అందవికారాలు చూస్తే నవ్విపోతాడు. నీవు ఆ పట్టుపరకిణీ కట్టుకో. మావయ్య తెచ్చిన వాయిలు వల్లెవేసుకో.

తిల : [కాలి బొటనవ్రేలితో నేలమీద రాస్తూ, మారాంచేస్తుంది] పట్టుపరికిణీ, పట్టుపరికిణీ! నీకు అదితప్ప మరేం కన్పించదు. అసహ్యంవేస్తుంది. మాజిస్ట్రేటుగారమ్మాయి కట్టుకుంటుందే పూలపరికిణీ, అది కట్టుకుంటానే అమ్మా! ఊదారంగు జాకెట్టుమీద జార్జెట్టు వల్లెవేసుకుంటా.

కోమ : సరేలే. నీ ఇష్టంవచ్చినట్లు కానీయి. నీకున్న రోగం అదే. నేను అవునన్నది నీవు కాదంటావు. నేనుమాత్రం ఆ ఎర్రరంగు గళ్ళ చీరె కట్టుకుంటా. అది నాకెంతో కళగావుంటుంది.
[వీళ్ళిలా మాట్లాడుతుండగా సుబ్బన్న బయటినుంచి వచ్చి లోపలికెడతాడు]

తిల : గళ్ళచీరె నీకేంబావుండదే అమ్మా! కోతిలా వుంటావు.

కోమ : కోతిలా వుంటానా?

తిల : అహ! నీవి నల్లటి కండ్లు. మెదమెదలాడే మొహం. కనకాంబరం కట్టుకుంటే దేవకన్యలా వుంటావు.

కోమ : అవునేవ్! నా కళ్ళు నల్లగా మెరుస్తుంటాయి. అందుకే క్లబ్బులో అంతా నన్ను మహారాణీ అని పిలుస్తారు.

తిల : [తెలివితక్కువగా నవ్వుతూ] మహారాణీ కాదే, కళావరు రాణీ!

కోమ : నోర్ముయ్! నేనేంకాదు కళావరు రాణి. నీ కామాట అనడానికి నోరెలా వచ్చిందే, తప్పుడుదానా? నేను మహారాణీనే!
[తిప్పుకుంటూ విసురుగా లోపలికెడుతుంది. తిలకంకూడా తల్లిని అనుసరిస్తుంది. ఇంతలో చక్రపాణి పెట్టె, బెడ్డింగు, మోసుకుని వస్తాడు. లోపల్నుంచి సుబ్బన్నకూడా వస్తాడు.]

చక్ర : [సుబ్బన్నతో] ఈ సామాను ఎక్కడ పెట్టాలి?

సుబ్బన్న : ఇటు పక్కనుంచి వెళ్లు.

చక్ర : [సామాను దించుతూ] ఉండండి. ఆయాసం తీర్చుకోనీయండి. కడుపులో ఎత్తులేనివాణ్ణి కట్టెడు బరువెలా మోస్తాను?

సుబ్బన్న : ఆఫీసరుగారు ఎంతసేపటి కొస్తారు ?
చక్ర : [చకితుడై] ఆఫీస రెవరు ?
సుబ్బన్న : అదే, మీ దొరగారు.
చక్ర : మా దొరగారా ? ఆయన ఆఫీసరయి ఎన్నాళ్ళయింది ?
సుబ్బన్న : పోనీ, ఆఫీసరు కాదులే.
చక్ర : ఎందుకాకూడదూ ! పైనుంచి కిందిదాకా ఆఫీస రే.
సుబ్బన్న : [అమాయకంగా] అంటే, మామూలు ఆఫీసర్లందరికంటె ఎక్కువకదూ ?
చక్ర : ఓ ! చాలా ఎక్కువ. అందరికంటె ఎక్కువ.
సుబ్బన్న : అందుకే ఇట్లో అంత హడావుడి చేస్తున్నారు.
చక్ర : అయ్యో ! నీవు చాల మంచివాడిలా వున్నావు. కాస్త తిన డాని కేదైనా తెచ్చిపెడతావు ?
సుబ్బన్న : ఇంకా ఏం తయారుకాలేదు. మీ దొరగారికోసం రక రకాలు తయారుచేస్తున్నారు. వంట కాగానే, నీకూ ఆయనతో పాటు వడ్డిస్తారు.
చక్ర : పోనీ, ఇప్పు డేరకం రెడీగావుంది ?
సుబ్బన్న : ఇప్పుడు మామూలు భోజనం వుంది. పప్పు, పులుసు, పచ్చడి.
చక్ర : ఓ ! అది చాలు. కాస్త పట్టా నాయనా ! ఆకలికి ప్రాణం తపతపలాడుతోంది. [సుబ్బన్న లోపలికి వెళ్ళబోతుంటే] ఇదిగో ! ఈ సామాను కాస్త గదిలోకి తోడుపట్టు. ఏ గదిలో పెట్టాలి ?
సుబ్బన్న : ఈపక్క నే. [చక్రపాణి, సామాను సుబ్బన్న నెత్తిమీద పెట్టి, అతనివెంట లోనికి వెడతాడు]

[ఇంతలో మిరియాలు, ధనియాలు ప్రవేశిస్తారు. మిరియాలు ముక్కుమీద పట్టీ వేసుకుంటాడు. గదిలో అదీ ఇదీ పరిశీలిస్తూ వుండగా, వసంతకుమార్‌ను వెంట పెట్టుకుని చైనులు ప్రవేశిస్తాడు. వారివెంట కైలాసగావు, పానకాలు, హయగ్రీవం కూడా వుంటారు. కింద కాగితం ముక్క పడివుంటే అది తీసెయ్యమని చైనులు, మిరియాలు, ధనియాలతో సైగచేస్తాడు. వాళ్ళిద్దరూ పోటీపడి ఆ కాగితం తీసి పారేస్తారు.]

వసంత : మీ సంస్థలన్నీ గొప్పగావున్నాయి. నాకెంతో నచ్చాయి. అనేక ఊళ్ళుతిరిగాను. నా కెవరూ ఇలాంటివి చూపలేదు. నాకోసం మీరెంతో శ్రమపడ్డారు.

చైనులు : ఇతర ఊళ్ళల్లోనా! తమకు మనవిచేస్తాను వినండి. ఎవరూ ఇంత శ్రద్ధ తీసుకోరు. ఆఫీసర్లు వచ్చినప్పుడు వాళ్ళ కళ్ళనీళ్ళు తుడవడానికి ఏదో చేస్తారు. మే మలా కాదు. ప్రజల శ్రేయస్సు కోసం, ప్రభుత్వ మర్యాద కాపాడడంకోసం, ఎంతో శ్రద్ధ తీసుకుని కృషిచేస్తాం.

వసంత : [గదంతా కలయచూస్తూ] మీ రిచ్చిన పార్టీ బ్రహ్మాండంగా వుంది. కడుపుపట్టకుండా తిన్నాను. మీరు రోజూ అలాంటి భోజనమే చేస్తారా?

చైనులు : లేదు. తమకోసం అవన్నీ ప్రత్యేకంగా తయారు చేయించాం.

వసంత : బ్రాందీ అన్నా, మంచి భోజనమన్నా నాకు తగనిఇష్టం. మనం తీసుకున్న ఆ కూరపే రేమిటి?

కైలాస : గోంగూర పులుసుకూర సార్!

వసంత : గోంగూర పులుసుకూర! గొప్పరుచిగావుంది. మనం ఎక్కడా డిన్నర్ చేసింది?

చైనులు : హాస్పిటల్లో.

[ఇంతలో సుబ్బన్న లోపల్నుంచి బ్రాందీసీసా, గ్లాసు తెచ్చి బల్లమీద పెడతాడు. గ్లాసులో బ్రాందీ పోసి, వసంతకుమార్‌కు అందిస్తాడు]

వసంత : [బ్రాందీ సేవిస్తూ] హాస్పిటలంటే జ్ఞాపక మొచ్చింది. మీ సంస్థలనుగురించి నేను కొన్ని సలహా లివ్వదలచాను. ఆ హాస్పిటల్లో రోగు లెప్పుడూ ఏడుపు మొహాలతో వుంటున్నారు. ఆడవాళ్ళను, మగవాళ్ళను వేరుచేయడంవల్ల దిగులుపడ్డారు. అందర్నీ కలిపి ఒకే వార్డులో పడెయ్యండి! మొహాల్లోకి కాస్త కళవస్తుంది. మరో విషయం, అక్కడ రోగులు అంతు లేకుండా

వున్నారు. చాలమంది చావుకుకూడా సిద్ధమైనారు. అలాంటి వాళ్ళకోసం శ్రమ ఎందుకు? మందులివ్వడం మానేసి భజ గోవింద శ్లోకాలు పఠించమనండి. ఆ పోయేవాళ్ళు సరాసరి వైకుంఠానికి పోతారు.' పైగా 'లంఖణం పరమౌషధం' అన్నారు పెద్దలు. వాళ్ళ కిచ్చే పాలు, రొట్టె ఆపుచేసి, లంఖణం పెట్టండి. అందువల్ల ప్రభుత్వానికి ఖర్చు తప్పుతుంది, బడ్జెట్టులో లోటూ భర్తీ అవుతుంది. పోతే హైస్కూలు విషయం. హైస్కూలు పాతపడిపోయింది. అది పడగొట్టి కొత్తది కట్టండి. మీరు చెప్పే విద్యవల్ల విజ్ఞానం కలుగదు సరి కదా ఉద్యోగంకూడా రాదు. ఇహ ఎందుకీ చదువు? దండగ చేటు. విద్యావిధానం పూర్తిగా మారాలి. అందుకు నే నొక పద్ధతి చెపుతాను. పిల్లలకు పరీక్ష పెట్టకుండా ప్యాసయినట్లు సర్టిఫికెట్లు ఇచ్చి పంపెయ్యండి. వాటితో వాళ్లు కట్నాలయినా సంపాదించుకుని అత్తవారిళ్ళల్లో మెత్తగా పడుంటారు. ఆ పంతుళ్ళ జీతాలు చాలడంలేదని గోలచేస్తున్నారు. జీతాలు పెంచి ఎక్‌స్ట్రా డ్యూటీలు అప్పచెప్పండి. ఇహ ఆ శరభయ్య శరణాలయం వుంది చూచారూ? అందులో బాలవితంతువులు చాలమంది వున్నారు. ఆ సర్వయ్య సత్రంలో దొంగసన్యాసు లెక్కువైనారు. ఈ సన్యాసులకూ, ఆ వితంతువులకూ ముడి పెట్టండి. నెత్తిమీదభారం కొంతయినా తగ్గుతుంది. ఇహ పోతే, కోర్టువ్యవహారాలు. ముద్దాయిలు సాక్షులుగా, సాక్షులు ముద్దాయిలుగా రికార్డయింది. బాగుంది. అందుకని ఒకపని చేయండి. సాక్ష్యం చెప్పడానికి వచ్చినవాళ్ళందరికీ శిక్షలు విధించండి. ముద్దాయిలను వదిలిపెట్టండి! నే నిచ్చిన ఈ సలహాలు అమూల్యమైనవి. వీటిని అశ్రద్ధచేశారూ అంటే, ప్రమాదం తప్పదు. [అధికార్లంతా భయపడతారు]

కైలాస: తమరు చెప్పిన పద్ధతిలో హాస్పిటల్‌ను మార్చివేస్తాను.

హాయ : తమరు చెప్పిన సూత్రాలు హైస్కూలులో అక్షరాలా అమలుజరిగేలా చూస్తాను.

పాన : తమ ఆజ్ఞానుసారం కోర్టు వ్యవహారాలు నడిపిస్తాను.

వసంత : [బ్రాందీ సేవిస్తూ] అయితే, అప్పుడప్పుడు మీరు కులాసాకు, పేకాటకు కూచుంటారా ?

చైనులు : [గుట్టు తెలుసుకోవాలనుకుంటున్నాడని భయపడతాడు] అమ్మయ్యో ! పేకాటే ! చీట్లాటన్నా, చిత్రాటన్నా నాకు చెడ్డ చిరాకు. చిన్నప్పుడోకసారి చీట్లాడుతుంటే, మా తండ్రిగారు అది చాల చెడ్డదని నన్ను వెదురుబెత్తంతో కొట్టారు. అది మొదలు పేకముక్క పట్టుకుని ఎరగను. ఆ తరువాత ఒకసారి మా తిలకమ్మకు పేకమేడ కట్టిస్తే అది కూలిపోయింది. ఆ రాత్రంతా కళావరురాణి కలలో ఆడింది. ఇలాంటి దుర్వ్యసనాల్లో పడి అమూల్యమైన కాలాన్ని వృధాచేయడంకంటె, దేశసేవలో గడపడం ఉత్తమమైనదని నా ఉద్దేశ్యం.

వసంత : కాదు, కాదు. పేకాటను పరిశీలించి అర్థం చేసుకోడంలోనే వుంది మజా ! ఒకసారి నష్టపడితే రెండోసారి రెట్టింపు కొట్టుకరావాలి. నా ఉద్దేశ్యంలో బల్ పసందైన ఆట పేకాట !

[చైనులు భార్య కోమలమ్మ, కూతురు తిలకమ్మ, అలంకరించుకుని ప్రవేశిస్తారు]

చైనులు : తమరు అనుమతిస్తే మా ఆడవాళ్ళను పరిచయంచేస్తాను. ఈమె నాభార్య కోమలమ్మ, ఈ అమ్మాయి నా కూతురు తిలకం !

వసంత : తిలకం ! రామతిలకం ! బ్యూటిఫుల్ నేమ్ ! మీ పరిచయభాగ్యం కల్గడంవల్ల, నా కెంతో ఆనందంగా వుంది.

కోమ : తమవంటివారి దర్శనం కావడం నా పూర్వజన్మ సుకృతం. నా జన్మ తరించింది.

వసంత : కాదు. నేనే తరించాను. మీరు కరుణించారు. [ఎగాదిగా చూచి] చైనులుగారికి మీరు రెండోసంబంధమా ?

కోమ : [చిరునవ్వు నవ్వి] ఎందు కలా అడిగారు ?

వసంత : ఏంలేదు. మీ వయస్సుకూ, వారి వయస్సుకూ చాలా తేడా కన్పిస్తోంది.

కోమ : [నవ్వుతూ] మావాళ్ళంతా నన్ను అలాగే అంటారు. శరీరాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటాను.

వసంత : అందుకే వయస్సువచ్చినకొద్దీ వన్నె వస్తోంది. [మరికొంచెం బ్రాందీ సేవిస్తాడు]

కోమ : మీ అభిమానానికి కృతజ్ఞురాలిని. దయచేసి కూర్చోండి. [సోఫా చూపుతుంది]

వసంత : ఫరవాలేదు. పోనీ, మీరంతగా అంటున్నారు కనుక కూచుంటాను. [కూర్చుంటాడు]

కోమ : పట్టణాల్లో వుండే తమవంటివారికి మా పల్లెటూళ్ళు బాగుంటాయా ?

వసంత : నిజం చెప్పారు. పల్లెటూరు రావడమంటే నాకు ప్రాణం మీదికొస్తుంది. పల్లెలు బాగానే వుంటాయి. పిల్లకాలువలు, చుట్టూ కొండలు...అయినా, ఢిల్లీకి సాటి మరొకటుందా? బహుశా మీరు నన్నొక సామాన్య ఉద్యోగిగా భావిస్తున్నారేమో ? కాదు. పై ఆఫీసరు నేనంటే ప్రాణమిస్తాడు. నేనే ఆఫీసరు, ఆఫీసరే నేను ! నావంటి సమర్థుడు మా డిపార్టుమెంటులో లేడు, [ఒక క్షణం అందరివైపు చూచి] ఫ్రండ్స్ ! మీరంతా కూచోక నిలబడ్డారేం ?

శైనులు : మే మెక్కడుండాలో మాకు తెలుసు.

పాన : మీ అంతస్థు ఎక్కడ ? మా అంతస్థు ఎక్కడ ?

హాయ : తమ ముందు మే మెంతటివాళ్ళం ?

కైలాస : దయచేసి మాతో పోటీపెట్టకండి !

మిరి : నేను నిలుచుంటాను.

ధని : నేనూ నిలుచుంటాను.

వసంత : [సోఫాలోంచి లేచి] Friends, Romans, I am sorry, Indians! Countrymen, and gentlemen! Lend me your ears! మీరూ, మేమూ అనే భేదాలు ఇక్కడ లేవు. తరగతులూ, తారతమ్యాలూ నేను పాటించను. పెద్దలు, పిన్నలు, అధికార్లు, జవాన్లు, ఆడాళ్ళు, మగాళ్ళు, అంతా సమానమే! ఏకకుటుంబం! అవతలవాణ్ణి తనతో సమానంగా గౌరవించడమే గొప్పవిషయం. వేదాంతాన్ని విరిచిచూస్తే ఏముంది కనుక? మన జీవితం మనకోసం కాదు. ఇతర్లకోసం. ఈ విషయాన్నే నేను అప్పుడప్పుడు పద్యరూపంలోను, మరో కప్పుడు గద్యరూపంలోను, పెడుతుంటాను. కూచోండి! దయ చేసికూచోండి! [A pause] నే నెక్కడికి వెళ్ళినా ఇదే మోస్తరు ప్రవర్తిస్తాను. సరాసరి గవర్నరు భవనంలోకి వెళ్ళి ఆయన పక్కన కూచుని పేకాడతాను. మంత్రులు, ఆఫీసర్లు, కమాండర్లు, నాకు షేక్‌హేండ్స్ ఇస్తుంటారు. ఒకసారి ఏం జరిగిందో తెలుసా? నన్ను చూచి ఛీఫ్ కమాండ రనుకున్నారు. అందరూ బందోబస్తులో నిలబడ్డారు. ఆ తరువాత ఇలా జరిగిందని నే నొక స్నేహితుడితో చెప్పితే 'అప్రనా! నీ మొహాంతీరే అంతిరా!' అన్నా డతను.

కోమ : మీరు... [ఏదో చెప్పబోయింది. అంతలో అతను అందుకున్నాడు. కోమలమ్మవైపు తిరిగి మాట్లాడ సాగాడు.]

వసంత : ప్రసిద్ధ సినిమాతారలు, నటీమణులు నాకు నమస్కారాలు చేస్తుంటారు. మా ఇంటిచుట్టూ ప్రదక్షిణం చేస్తుంటారు. నేను వాళ్ళకు నాటకాలు వ్రాసిపెట్టాను. చూచారా? నాకు ప్రఖ్యాత రచయిత లందరితోను పరిచయముంది. తిరుపతి వెంకటకవులు నా ప్రాణస్నేహితులు! నా సలహా లేనిదే రచన ప్రారంభించే వాళ్ళు కాదు.

కోమ : మీరు కవిత్వంకూడా రాస్తారూ? కవిత్వ మంటే నాకు పిచ్చెక్కుతుంది.

వసంత : కవిత్వమే కాదు కథలు, నాటకాలు, నవలలు, వ్యాసాలు ఎన్నో వ్రాశాను.

కోమ : (ఆసక్తితో) ఏ పత్రికల్లో వ్రాశారు?

వసంత : బాల మొదలు భారతివరకూ నా రచన అచ్చుకాని పత్రి కంటూ లేదు. ఆంధ్రపత్రిక స్థాపించమని నేనే సలహా ఇచ్చాను. సుప్రసిద్ధ సాంఘిక నాటకం 'కన్యాశుల్కం' వ్రాసింది నేనే!

కోమ : కన్యాశుల్కం వ్రాసింది గురజాడ అప్పారావుగారంటారే?

వసంత : ఆ కన్యాశుల్కం వేరు.

కోమ : [వెంటనే] అవును. నేనూ అదే అనుకున్నాను.

వసంత : [బ్రాందీ సేవిస్తూ] ఒకటేమిటి? ఎన్నో నాటకాలు వ్రాశాను. ఆడాను, ఆడించాను! తీరికసమయాల్లో నాకు రచనతప్ప మరో పని లేదు. కాని నాకు తగినంత విరామం లేదు. ఏం చేయను? థియేటరువాళ్ళువచ్చి 'ఒక్కనాటకం రాసిపెట్టండి. మీనాటకం ఆడితే జనం విరగబడతారు' అని బ్రతిమాలేవారు. వాళ్ళమాట కాదనలేకపోయేవాణ్ణి. నేను స్వయంగా నటుణ్ణికూడా అవడం వల్ల, నా నాటకమంటే జనానికి గంగవెర్రు లెత్తుతుంది. నేనూ, బళ్ళారి రాఘవుడూ కలిసి నాటకాలు ఆడేవాళ్ళం. ఇద్దరం ఒకసారి లండన్ వెళ్లాం. గ్లోబ్ థియేటరులో షేక్‌స్పియరు నాటకాలు ప్రదర్శించాం. ఆక్సుఫర్డు యూనివర్సిటీ ప్రొఫెసర్లు, విద్యార్థులు, ఓ! థియేటరు పట్టకుండా జనం వచ్చారు. నాకూ, రాఘవుడికీ పోటీపడింది. నేను Hamlet Act చేస్తూ 'To be or not to be; that is the question' అని భూదేవిని చూస్తూ ప్రశ్నించేసరికి ప్రేక్షకులంతా ప్రతి మల్లా స్తంభించిపోయేవాళ్ళు! అందుకే నన్ను 'గొప్ప రచయిత, అద్భుతమైన నటుడు' అన్నాడు బెర్నార్డ్‌షా!

కోమ : అయితే మీకు చాలా డబ్బొస్తుందే!

వసంత : అవును. రచనలమీద సంవత్సరానికి నలభైవేలొస్తాయి.

కోమ : అయితే, వేయి పడగలు వ్రాసింది మీరే అనుకుంటా!

వసంత : అవును, నేనే.

కోమ : వేనరాజు ?

వసంత : అవును, అలాంటివి చాలావున్నాయి.

కోమ : నే నప్పుడే అనుకున్నా, అవి మీవేనని.

తిల : [తల్లితో] అమ్మా! వాటిమీద రచయిత 'విశ్వనాధ' అని వుండే.

కోమ : నీకున్న రోగం అదే. నేను అవునన్నది నీవు కాదంటావు.

వసంత : ఆ అమ్మాయిని తిట్టకండి. పువ్వులాంటి పిల్ల. ఆ పిల్ల చెప్పింది నిజమే. ఆ గ్రంథాలు విశ్వనాధే వ్రాశాడు. కాని అవే పేర్లతో నేనుకూడా వ్రాశాను.

కోమ : [వెంటనే] అయితే నేను చదివింది మీరు వ్రాసినవే. అందుకే అంత అద్భుతంగా వున్నాయి.

వసంత : సాహిత్యం నా ప్రాణం! నా జీవితం! ఢిల్లీలో నా భవనం 'వసంత విహార్' తెలీనివాళ్ళు లేరు. అదే 'వసంతవిహార్, అదే వసంత విహార్ !' అని వేలుపెట్టి చూపించుకుంటూ పోతుం టారుజనం [అందరివైపు తిరిగి] ఫ్రండ్స్! మీరు ఢిల్లీవస్తే నా భవ నానికి రండి. మీకు డ్రింకులు ఇస్తాను. డిన్నర్, డాన్సుకూడా ఏర్పాటు చేస్తాను.

కోమ : ఓ డాన్సులు!........

వసంత : మీరు ఊహించుకోలేరు. నేను విదేశాలకు వెళ్ళినప్పుడు నాకు బాల్‌డాన్సు అలవాటయింది. డాన్సుకు వెళ్ళి టేబులు ముందు కూచుని ఒకసారి టిఫిన్‌చేస్తే వేయిరూపాయల బిల్లు అయ్యేది. దొరలపక్క కూచుని బ్రాందీ సేవిస్తుంటే ఎంత గ్రాండ్‌గా వుంటుంది! ఓ, ఆజీవితం మీ కర్థంకాదు. ఆ అద్భు తాలు మీరు చూళ్ళేరు. అనేక దేశాల ప్రతినిధులు, రాయ బార్లు, గొప్పగొప్ప ఆఫీసర్లు నాతో వుండేవాళ్ళు. అలా నృత్యం

చేసి అలసిపోయి నా భవనం నాలుగో అంతస్థులోకి వెళ్ళి విశ్రాంతి తీసుకునేవాణ్ణి. తెల్లవారేసరికి తిరిగీ మహారాజులు, మంత్రులు, జమీందార్లు నా భవనంచుట్టూ తేనెచుట్టూ మూగే ఈగల్లా ముసురుకునేవాళ్లు.

[చైనలు తక్కినవాళ్లు భయంతో కంపించి పోతుంటారు. కోమలమ్మ, తిలకం లోపలికి వెడతారు. వసంతకుమార్‌కు అవయవాలు స్వాధీనం తప్పుతున్నాయి. చాలా ఉద్రేకంగా వున్నాడు] యువర్ ఎక్సెలెన్సీ, యువర్ ఎక్సెలెన్సీ! అనే విలాసంతో నా కొచ్చేవి ఉత్తరాలు. మీకు కూడా వార్నింగ్ ఇస్తున్నాను. గొప్ప ఆఫీసర్లను ఎలా సంబోధించాల్సిందీ, ఎలా గౌరవించాల్సిందీ మీకింకా తెలీలేదు. మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోండి. నన్ను మీరంతా 'యువర్ ఎక్సెలెన్సీ, యువర్ ఎక్సెలెన్సీ!' అని సంబోధించాలి. తెలిసిందా? జ్ఞాపకం వుంచుకోండి. [అంతా భయభ్రాంతులై చూస్తుంటారు.] ఏమనుకున్నారు మరి? రాజధాని నగరంలో ఇంత గొప్పపదవి నిర్వహిస్తున్నానూ అంటే, మజాఖా! సామాన్యుడెవడూ ఈ పదవిలోకి రాలేడు. ఇంత ఉచ్చస్థితిలోకి ఎలా వచ్చాను? నా తెలివితేటలవల్ల, నా శక్తి సామర్థ్యాలవల్ల. ప్రభుత్వం నన్ను మెచ్చుకుంది. బిరుదు లిచ్చింది. నేను తమాషాగా మాట్లాడుతున్నా ననుకుంటున్నారేమో! నా విషయం మీ కింకా తెలీదు. ఒకసారి నన్నొక డిపార్టుమెంటులో పనిచేయడానికి అమెరికా పంపారు. [బ్రాండీ సీసా ఖాళీ చేస్తాడు] మొదట్లో నేను అంగీకరించలేదు. కానిచివరకు గవర్నరు సలహా ఇచ్చారు. మరెవ్వరూ అందుకు సమర్థులు కారని ఆయనచెప్పాడు. ఒప్పుకున్నాను, కాని ముందే హెచ్చరిక చేశాను. 'నేను సామాన్యుణ్ణికాదు. డిపార్టుమెంటులో జరిగే అన్యాయాలు సహించను. ఏ విషయాన్ని అయినా వేయి కళ్ళతో చూడగలను. నేను వెళ్ళినచోట భూకంపం పుట్టిస్తాన'ని చెప్పాను. చివరకు అక్షరాల అదే జరిగింది. ప్రభుత్వశాఖను తారుమారు చేశాను. పైనుంచి కిందివరకు పట్టి చూచాను.

అంతే! నిజంగా భూకంపం పుట్టింది. డిపార్టుమెంటు అంతా ఆకులా అల్లల్లాడింది. [అందరూ భయంతో వణికిపోతారు] అందుకే నేనంటే అందరికీ హడల్! నన్నెవరూ ఆపలేరు. నేను ప్రతివేసవిలోనూ కాశ్మీర్ వెడతాను. అక్కడ నాకు తాజ్‌మహల్‌లాంటి సుందర భవనంవుంది. అందులో హాయిగా ఆడుతూ, పాడుతూ కాలంగడుపుతాను. ఈరోజు కాకపోతే, రేపయినా నేను గవర్నరు అయిపోతాను. [చివరి మాటలంటూ పడిపోతాడు. అధికార్లంతా అతన్ని పట్టుకోడానికి భయపడుతుంటారు]

చైనులు : [ఆపాదమస్తకం కంపించిపోతూ కష్టంమీద మాట్లాడ్డానికి యత్నిస్తాడు] యువర్...యు...యువర్!

వసంత : [వేగంగా] ఏమిటి మీరనేది? నాన్సెన్స్! నేనెవరనుకున్నారు?

చైనులు : [మళ్ళీ] యువర్...యు...యువర్ ఎక్సెలెన్సీ...

వసంత : [క్రైగర్‌లా లేస్తాడు] సైలెన్స్! నన్ను చూచి ఎవరనుకుంటున్నారు? నాకే ఎదురుతిరుగుతున్నారుగా? మిమ్మల్ని ఏంచేస్తానో చూడండి. నాకు తెలుసు. మీ సంగతంతా తెలుసు. లంచాలు పట్టడమే మీ వృత్తి! మోసాలు చేయడమే మీ చరిత్ర! వెళ్ళండి! వెళ్ళండి! ముందిక్కణ్ణుంచి వెళ్ళండి! (మళ్ళీ పడిపోతుంటే చైనులు పట్టుకుంటాడు.)

చైనులు : యువర్ ఎక్సెలెన్సీ! కొంచెం విశ్రాంతి తీసుకోరూ? తమ గది సిద్ధంగా వుంది. తమకు కావల్సిన ఏర్పాట్లన్నీ చేయించాను. కొంచెంసేపు పడుకోండి.

వసంత : కొంచెంసేపు పడుకోండి, రబ్బిష్! బాల్‌డాన్సు చేయరేం? ఆల్ రైట్! పడుకుంటాను. మీరు నాకు బ్రహ్మాండమైన పార్టీ ఇచ్చారు. మీరంటే నాకిష్టం. ఫరవాలేదు. లంచాలు పట్టండి! మోసాలు చెయ్యండి! ఆల్‌రైట్! పడుకుంటాను. [చైనులు, అతన్ని పట్టుకొని గదిలోకి తీసుకుపోతుంటారు. అంతా నిశ్చేష్టులై నిలబడి వుంటారు.] పార్టీ! డిన్నర్! డాన్సు! గ్రాండ్! గోంగూరపులుసుకూర! (తెర)

# నాలుగో రంగము

[మరునటిరోజు ఉదయం. రంగస్థలం వెనకటిదే. తెరతీసేసరికి చైనులు స్టేజిమీద కన్పిస్తాడు. చిన్న లుంగీ కట్టుకుని, బనీను తొడుక్కొని వుంటాడు. వసంత కుమార్ పడుకుని నిద్రపోతున్న గదిలోకి తొంగిచూస్తాడు. ఆఫీసరు గాఢనిద్రలో వున్నాడుకదా అని సంతృప్తిపడతాడు. తిన్నగా ఇవతలికొచ్చి కిటికీలోంచి గుమ్మంలోకి తొంగిచూస్తాడు. మెల్లగా చేతి సైగతో కాన్‌స్టేబుల్సును పిలుస్తాడు]

చైనులు: ఇష్! ఇలారా! [ఇద్దరు పోలీసులు బూట్లు చప్పుడు చేసుకుంటూ లోపలికి వస్తారు] ఇష్! దున్నపోతులు! చప్పుడు చెయ్యొద్దంటే మిలిటరీ వెధవల్లా మార్చింగ్ చేస్తారేం? హెడ్‌కాన్‌స్టేబులు ఏడీ?

ఒక కాన్‌స్టేబులు: పనివాళ్ళను తీసుకుని రోడ్లు ఊడిపించడానికి వెళ్ళాడుసార్!

చైనులు: సరే. తెలివిగావున్నాడుకదా వెధవ! చూడు! మీ ఇద్దరూ గేటుదగ్గరే వుండండి. ఎవడైనా నా మీద పిటీషను తెస్తాడేమో చూడండి. ఎవడొచ్చినాసరే, లోపలికి రానీయవద్దు. ఆ అర్జీలు లాక్కొని పరపర చింపెయ్యండి. చూడు! ఇట్లా! [చేతులతో అభినయిస్తాడు] ఆ తరువాత మెడమీద ఒక తన్ను తన్ని పంపెయ్యండి. చూడు! ఎట్లా?

కాన్: ఇట్లా! [కాళ్ళతో తన్నిచూపుతాడు]

చైనులు: ఇష్! చూడు! ఎవడైనాసరే, కోబ్రహ్మరానీ. దొరగారి దర్శనం కాదనిచెప్పు. కాళ్లు, చేతులు కట్టి విసిరి అవతల పారెయ్యండి. వీడావదులుతుంది వెధవలు. తెలిసిందా? [కాన్‌స్టేబుల్సు తలలూపుతారు. మెల్లగా మునివేళ్ళమీద నడుస్తూ వెళ్ళిపోతారు. లోపల్నుంచి కోమలమ్మ, తిలకం ప్రవేశిస్తారు. ఇద్దరూ ముస్తాబై వుంటారు]

కోమ: [భర్తను చీదరింపుగా] ఏమిటా వేషం నీవూ? సిగ్గులేకుండా...

చైనులు: అబ్బబ్బ! నీవు, నీవు! ఎప్పుడుబట్టినా ఏకవచన ప్రయోగం ఏడుస్తుంటావు. ఆఫీసరున్న నాలుగురోజులైనా ఆ ఏడ్పేదేమిటో బహువచనంలో ఏడువు! పరువు పోతుంది.

కోమ: [బిగ్గరగా] మరేంఫరవాలేదు. ఏవచనంలో ఏడ్చినా ఒకటే! ఉన్న పరువు ఊడిపోదు. లేని పరువు పైనపడదు.

చైనులు: ఎంతచెడ్డా ఆఫీసరునుకదటే?

కోమ: [ఇంకా బిగ్గరగా] ఆ! ఆ! ఎందుకా్కదూ? ఊరందరికీ ఆఫీసరువయితే నాకేం ఆఫీసరువయ్యా? నాకు నీవు నీవే!

చైనులు: ఇష్! అరవకే నీదుంపతెగ! చిన్నగామాట్లాడు. ఆయన మంచి నిద్రలోవున్నాడు. నా కసలే తల తిరిగిపోతోంది. ఏం కుంభకోణం చేస్తాడో ఏమో! ఉరిశిక్ష పడ్డవాడిలా వుంది నా పని. రాత్రంతా కన్ను మూయలేను. ఒకటే ఆలోచన, గుండె అదురు. ఏమవుతుందో, ఏంపాడో?

కోమ: ఎందుకంత భయం? ఆయన ఎదుట నాకేం భయంలేదే! గొప్పగా చదువుకున్నవాడు. పదిమందిలో తిరగనేర్చినవాడు. నా కళ్ళ కొక దివ్యపురుషుడులా కన్పిస్తున్నాడు. అంత పెద్ద పదవిలో వున్నా ఏమాత్రం బెట్టులేదు. నాతో ఎంత చనువుగా వున్నాడో చూళ్ళేదూ?

తిల: [అమాయకంగా] అమ్మా, అమ్మా! ఆయన నా కెంతో ముద్దొస్తున్నాడే!

కోమ: [బిగ్గరగా] నీవు నోరుమూసుకోవే మొద్దూ! [భర్తతో] అసలే జల్సామనిషి. పైగా పట్నంపిట్ట. మాటలపుట్ట! ఏం నాజూకూ ఏంకథ! కులుకుతూ మాట్లాడతాడు. అదేమిటో నావైపు దొంగచూపులు చూస్తాడు. నే నప్పుడే కనిపెట్టా!

తిల: నీవైపా అమ్మా చూస్తున్నదీ? నీవైపు కానేకాదు. నావైపే అదేపనిగా చూస్తున్నాడు.

కోమ: [కసురుకుంటూ] ఛీ! నోర్మూయ్! నీవైపు చూస్తున్నాట్ట, నీవైపు! నీకన్నా మంచి మొహం దొరకక? పిచ్చివాగుడు వాగితే గదిలో పెట్టి తాళంవేస్తా!

చైనులు : ఇష్! మీా ఆడగొంతులు పాడుగాను. ఏం అకుపులే? ఒకమాట సరిపోదూ? అస్తమానం మీా వాదన వినలేక చస్తున్నా! తల్లి ఒకదోవ, పిల్ల ఒక దోవ! [A pause] ఆ! అతని విషయం నాకు తెలీకపోలేదు. అతను నిన్న చెప్పినదంతా అక్షరాల నిజం. నాకు తెలుసు. తాగినప్పు డెవడైనాసరే, లోపలున్న రహస్యాలన్నీ కక్కేస్తాడు. ఒకటీ, అర, అబద్ధం వుంటే వుండొచ్చు. అలా ఎవడైనా చెపుతాడు. మొత్తానికి అతను అఖండుడు. ఉన్నతపదవిలో వున్నాడు. మంత్రులంటే అతనికి మంచినీళ్ళప్రాయం. రోజూ పార్లమెంటుమెంబర్లతో పేకాడుతాడు. మన కిక్కడ మాజిస్ట్రేటు, డాక్టరు ఎంతో అక్కడతనికి వాళ్ళంతే! అది అతని నిత్యజీవితం.

కోమ : నీకసలే పిరికితనం. నీవు కాబట్టి భయపడుతున్నావుగాని, నేనైతేనా?

చైనులు : ఆ, అతను ఎంత తెలివైనవాడైనా చివరకొక విషయంలో పప్పులో కాలేశాడు. ఎందుకో తెలుసా?

కోమ : ఎందుకేం?

చైనులు : అతనింకా కుర్రాడు. ఉద్యోగంలో అనుభవం తక్కువ. చెప్తాను విను. నిన్న హోటల్లో కల్లబొల్లికథలన్నీ అల్లి నాకు టోపీవేద్దామని చూచాడు. తా నెవరో సామాన్యుడైనట్లూ, ఆఫీసరు కానట్లూ నాటకం ఆడాడు. కాని మనం పార్టీలిచ్చి బ్రహ్మాండంగా సత్కారాలు చేసేసరికి, ఆ తాగుడు మైకంలో, అసలు విషయాలన్నీ కక్కేశాడు. గొప్పఆఫీసరునని తనకు తానే బయటపడ్డాడు. చూచావా? మన మంత్రం ఎట్లా పారిందో?

[లోపలగదిలోంచి చక్రపాణి ప్రవేశిస్తాడు.]

కోమ : [చక్రపాణితో] ఇదిగో! ఇలా రా నాయనా!

చైనులు : [చక్రపాణితో] మీా అయ్యగారు నిద్రపోతున్నారా?

చక్ర : గాఢనిద్రలో వున్నారు.

కోమ : ఇదిగో ? నీ పేరేమిటి బాబూ ?

చక్ర : చక్రపాణి అమ్మా !

చైనులు : [భార్యతో] చాలుచాలు. ఇంక ఎక్కువ అడగొద్దు [చక్రపాణితో] చూడు నాయనా ! నీవు రాత్రి కడుపునిండా భోంచేశావా.

చక్ర : మీ దయవల్ల కమ్మగా భోంచేశాను.

కోమ : [చక్రపాణితో] చక్రపాణీ! నాకోమాట చెప్పు. మీ అయ్యగార్ని రోజూ జమీందార్లు, మహారాజులు దర్శిస్తుంటారా !

చక్ర : ఓ ! ఒకరేమిటి ? వందలమంది ఆయనభవనంలోకి వచ్చిపోతుంటారు.

తిల : చక్రపాణీ! మీ దొరగారు అచ్చంగా సినిమా యాక్టరు నాగేశ్వరరావులా వుంటాడు కదూ ?

కోమ : [చక్రపాణితో] ఈ ఒక్కమాట చెప్పునాయనా! మీ అయ్యగారు...

చైనులు : [మధ్యలో అందుకుని, భార్యను మాట్లాడకుండా చేస్తాడు] చాలు చాలు ! ఇహ ఊరుకోండి చొప్పదంటు ప్రశ్నలు వేసి చంపుతున్నారు. [చక్రపాణితో] ఇదిగో, చక్రపాణీ ! మీ అయ్యగారు ఎలాంటివారు ? మనసు మెత్తదేనా ? లేక తప్పులుపట్టి చంపుతాడా ?

చక్ర : లేదు. ఎప్పుడూకూడా వ్యవహారాలన్నీ సాఫీగా జరిగిపోవాలంటారు. అంతే !

కోమ : [ఆసక్తిగా] ఆయన యూనిఫారం వేసుకుంటే ఎలా వుంటుంది ? ఆయనకు జీతమెంత !

చైనులు : [భార్యతో] ఇష్ ! ఊరుకోవే! అనవసరమైన వాటికి ఎందుకంత ఆదుర్దా ? అవసరమైనవి వదిలేసి గుడ్డిప్రశ్నలు వేస్తావు.

నన్నొక ముఖ్యమైన విషయం అడిగి తెలుసుకో నివ్వవు, [చక్ర పాణితో] చూడు నాయనా! మీ అయ్యగారు టూరింగులో వున్నప్పుడు వేటమీద దృష్టి వుంచుతాడు? ఆయన కెలాంటివి ఇష్టం?

చక్ర: ఆ సందర్భాన్నిబట్టి వుంటుంది. చెప్పలేం! మొత్తానికి సరదాలు, సత్కారాలు వుంటే సంతోషిస్తారు.

సోమ: [చక్రపాణితో ఆదుర్దాగా] చూడు చక్రపాణీ! ఆడవాళ్ళ క్లబ్బులనుగురించి మీ అయ్యగారి అభిప్రాయం ఏమిటి?

తిల: [ఇంకా ఆదుర్దాగా] చక్రపాణీ! మీ దొరగారికి హార్మొనీ పాట ఇష్టమేనా?

చైనులు: ఇహ నోళ్ళుమూయండే, మీ నోళ్లూ మీరూ పాడు గాను. ఒకటేవాగుడు! అర్థంబర్థంలేదు. నే నేదో అడుగుతోంటే మధ్యలో రాహు కేతువుల్లా అడ్డం చస్తారు. [చక్రపాణితో] ఏమిటినాయనా! నీవు చెవుతున్నది?

చక్ర: అవును. అయ్యగారికి కులాసాఉండాలి. మజాలు చెయ్యాలి. నేనున్నాను చూడండి. అల్పుణ్ణి. అయినా, ఆయన నన్నొక ఆప్తమిత్రుడిలా చూచుకుంటారు. ఎక్కడికన్నా టూరింగ్ వెడతామా? 'ఏం చక్రపాణీ! నీకు బాగా మర్యాద చేశారా? భోజనం వగైరా సదుపాయాలన్నీ చక్కగావున్నాయా?' అని అడుగుతారు. 'అబ్బే! ఏం సరిగాలేవు' అని చెపుతా ననుకోండి. 'అయితే అది నోటుచేసుకో. ఢిల్లీ వెళ్ళగానే జ్ఞాపకంచెయ్యి. వాళ్ళ భరతంపడతాను.' అంటారు వెంటనే. కాని నేను చూడండి. నా మనసులోనే వుంచుకుంటాను గాని ఇలాంటి స్వల్పవిషయాలు ఆయనకు గుర్తు చేయను. పిల్లలుకలవాళ్ళ నోట్లో మట్టికొట్టడం ఎందుకని పాపం తలుస్తాను.

చైనులు: గుడ్ గుడ్! నీవు చాల మంచివాడివి. నీ మొహం చూడగానే తెలిసింది. నీకు టూరింగులో టీ తాగడానికి డబ్బు

లిస్తాలే. ప్రస్తుతం ఈ అయిదు రూపాయలు దగ్గరుంచుకో. దేని కైనా అక్కరకొస్తుంది. [డబ్బిస్తాడు].

చక్ర : [తీసుకుంటూ] చిత్తం. ఈ పేదవాణ్ణి ఒక కంట కనిపెట్టి వుండండి.

కోమ : సరే! ఇహ నేను కబుర్లు చెప్తూ కూర్చోడానికి వీల్లేదు. బోలెడంత చాకిరీవుంది. ఆయన నిద్ర లేచేసరికి అన్నీ అమర్చాలి; చక్రపాణీ! తరువాత కనిపిస్తావు కదూ? సన్ను మరిచిపోనులే! రా తిలకం! నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. [కోమలమ్మ, తిలకం లోపలికి వెడతారు]

చైనులు : [చక్రపాణితో] వెళ్ళు నాయనా! మీ అయ్యగారిదగ్గరే వుండు. ఏం కావల్సినా నన్నడుగు. [చక్రపాణి లోపల గదిలోకి వెడతాడు. ఇంతలో పానకాలు, కైలాసరావు, హయగ్రీవం, మిరియాలు, ధనియాలు, ప్రవేశిస్తారు. చైనులు వాళ్ళను చూస్తాడు.] మీరంతా అప్పుడే వచ్చారేం?

కైలాస : హిజ్ ఎక్సలెన్సీ దర్శనం చేసుకుందామని.

చైనులు : [మిరియాలు, ధనియాలుతో] మీరూ?

మిరి : నేను దొరగారితో ముఖ్యమైన పనుండి వచ్చాను.

ధని : నేనూ ముఖ్యమైన పనుండి వచ్చాను.

చైనులు : ఏం అయ్యవార్లంగారూ? మీ హైస్కూల్లో అన్నీ సక్రమంగా వుంచారా?

హయ : నన్నాకణ్ణే ఏం ఏడవమంటారు! ఎవరూ కలిసిరాంచే!

చైనులు : సరే. నేను వెడతాను. డ్రెస్ చేసుకోవాలి. మరికొన్ని ముఖ్యమైన పనులున్నాయి. మీరంతా ఆర్డరులో వున్నారు కదూ?

కైలాస : ఆసుపత్రిలో ఎంతచేసినా దుర్గంధం పోకుండావుంది.

చైనులు : [విచారంగా] అవును. నాకు తెలుసు.

(చైనులు ఇంట్లోకి వెడతాడు. పడకగదిలోంచి వసంతకుమార్ దగ్గడం విన్పిస్తుంది]

పాన : డియర్ ఫ్రండ్స్! త్వరగా అందరూ వరుసలో నిలబడండి. డీసెంటుగా వుంటుంది. ఆయన మంత్రుల్ని, మహారాజుల్ని హడలగొట్టిన ఘటం! జాగ్రత్త! మన గతి ఏమవుతుందో! క్విక్! అటెన్షన్‌లో నిలబడండి. మిరియాలూ! మీ ఇద్దరూ అటొకరూ, ఇటొకరూ! నిలుచోండి. [వాళ్ళిద్దరూ మునివేళ్ళమీద గాభరాగా అటూ, ఇటూ పరిగెత్తుతారు]

కైలాస : [పానకాలుతో] పానకాలుగారూ! మనం ఏదో ఒకటి ఆలోచించాలి. లేకపోతే ప్రమాదం తప్పదు. మరి మీ ఉద్దేశ్యం ఏమిటి?

పాన : అంటే...!

కైలాస : అదేనండీ! మీకు తెలుసుగా!

పాన : అంటే మీరనేది? [డబ్బివ్వడమా అన్నట్లు చేతిసైగ ద్వారా అడుగుతాడు.]

కైలాస : అవును. అదే చెయ్యాలి.

పానకాలు : [భయంతో] వద్దు. చాల డేంజరస్! గొప్పవాడు. అలాంటివేవీ తీసుకోడేమో? పైగా తిట్లకు లేచాడా ఫినిష్! మనగతి కృష్ణజన్మస్థానమే! పోనీ ఏదైనా ఫండుకింద చందా పేరుతో ఇస్తే?

కైలాస : అహ! అలాకాదండీ! పోస్టాఫీసులో ఎక్కడో డబ్బు పడివుందనీ, అదెవరిదో తెలీడంలేదనీ చెప్పి మనకాంతయ్య ద్వారా ఇప్పిస్తే?

పాన : లేకపోతే ఒకటి చెయ్యొచ్చు. కోర్టులో సాక్ష్యం చెప్ప డానికి వచ్చినవాళ్ళెవరో డబ్బు పారేసుకున్నారని చెప్పి యిస్తే ఎలా వుంటుంది?

కైలాస : అలాకాదండీ! ఇప్పుడు మంచి ఆలోచనతట్టింది. ఒక్కొక్కళ్ళం వెళ్ళి ఇంటర్వ్యూ అడుగుదాం. ఆ తరువాత మనస్థితి

గతులు చెప్పుకుందాం. అప్పుడైతే నాలుగుకళ్ళకే తెలుస్తుంది. ఏం జరిగినా గుట్టుగా వుంటుంది.

పాన : అవును. భేషుగ్గావుంది.

కైలాస : అయితే ముందు మీరే వెళ్ళండి పానకాలుగారూ!

పాన : వద్దు. ముందు మీరే వెళ్ళండి. హిజ్ ఎక్సలెన్సీముందు మీ ఆసుపత్రికేగా వచ్చారు! మొదటి డిన్నర్ కూడా మీరే ఇచ్చారాయె?

కైలాస : పోనీ, అయ్యవార్లంగారిని వెళ్ళమందామా? ఎలాగైనా ఉపాధ్యాయుడు. ఉపనిషత్తులు చదివినవాడు. మనకంటె వయస్సులో వున్నాడు. నిర్భయంగా మాట్లాడగలడు.

హాయ : [భయంతో] No, No! ముందు నేనువెళ్ళను. అధికార్లంటే నా కమితభయం. చిన్నప్పటినుంచీ అంతే. పోలీసుల్ని చూస్తేనే జడుసుకుంటాను. పెద్ద ఆఫీసరు! ఆయన్ని చూస్తేనే దడపుడుతుంది. నోటివెంట మాటరాదు. మీ రెవరైనా వెళ్ళడం బెటర్!

కైలాస : ఇహముందు మీరే వెళ్ళాలి పానకాలుగారూ! తప్పదు. మేమంతా అసమర్థులం! ఒకటి చెప్పబోయి, ఒకటి చెప్పామా, కొంపలంటుకుంటాయి. ఎలాగైనా మీరు కోర్టు వ్యవహారాల్లో ఆరితేరినవారు. ఒక లెక్చరు ఇవ్వండి!

పాన : అవును. ఉపన్యాసాల్లో నాకో మెడలుకూడా వచ్చింది. ఒకసారి ఆడవాళ్ళనుగురించి ఆరు గంటలు మాట్లాడాను. కాని...

కైలాస : కానీలేదు, అర్థణాలేదు. మూలగకండి!

మిరి : ముందు మీరే!

హాయ : మా అందరికీ నాయకత్వం వహించండి.

కైలాస : తప్పదు.

పాన : [ఆలోచించి] అయితే ఒకపనిచేద్దాం. అందరం బయటికివెళ్ళి వరండాలో నిలుచుందాం. ఒక్కొక్కళ్ళం వచ్చి ఆయన్ని దర్శించుకుందాం.

[అంతా బయటికివెళ్ళిపోతారు. గదిలోంచి వసంతకుమార్, అతని సేవకుడు చక్రపాణి ప్రవేశిస్తారు. వసంతకుమార్ చేతిలో కొన్ని కాగితాలు, Writing pad వుంటాయి ]

వసంత : [సోఫాలో కూచుంటూ] చక్రపాణీ! మనచక్రం తిరిగిందిరా! ఈ ఊరి అధికార్లు మనవల్లోపడ్డారు. మనల్ని ఎలా గౌరవిస్తున్నారో చూస్తున్నావా ?

చక్ర : అవును. నేను అప్పుడే కనిపెట్టా. మీరెవరో పై ఆఫీసరని హడలుకుని చస్తున్నారువాళ్ళు. మనం నక్కను తొక్కివచ్చాం. సమయం దొరికింది. సక్రమంగా ఉపయోగించుకోండి. మనకు పైసా ముఖ్యం. బాగా మస్కాకొట్టి మనీ చేతిలో వేసుకోండి. కాస్త బ్రెయిన్ ఉపయోగిస్తేసరి !

వసంత : ఓరిదద్దమ్మా! కాస్తఏమటి కర్మ! సొంతం ఉపయోగిస్తున్నా! అసలు మన బ్రెయిన్ ఇలాంటివాటికేగా? వేలుపట్టే సందుదొరికితే కాలుపెట్టినట్టూ సన్యాసీ! స్కీము వేసి సిద్ధంగా వుంచాను. [బయటచప్పుడువినిపిస్తుంది. వసంతకుమార్ సర్దుకుని సీరియస్‌గా కూచుంటాడు.] ఒరేయ్ ! వాళ్ళువస్తున్నట్లున్నారు. నీవు అవతలవుండి జాగ్రత్తగా కనిపెడుతూ వుండు. [చక్రపాణి లోపలి గదిలోకి వెడతాడు. పానకాలు ప్రవేశిస్తాడు.]

పాన : [భయభక్తులతో] గుడ్ మార్నింగ్ యువర్ ఆనర్ ! ఈ ఊరి సబుమేజస్ట్రేటును. తమ దర్శనంకోసం వచ్చాను.

వసంత : [వ్రాసుకుంటూ, సీరియస్‌గా] ఊ !

పాన : నా పేరు పానకాల నాయుడు !

వసంత : [ఇంకా సీరియస్‌గా] మిమ్మల్ని గురించి విన్నాను. చాలా చాలా విన్నాను. వచ్చిన పనేమిటో వెంటనే చెప్పండి. [మళ్ళీ

వ్రాసుకుంటూంటాడు. ఆ వ్రాసుకునేది తనను గురించే అని పానకాలు భయపడతాడు.]

పాన: ఏంలేదు. కొద్ది క్షణాలు ఇంటర్వ్యూ ఇప్పించండి.

వసంత: [తలెత్తి గంభీరంగా] ఏమిటి అవసరం? మీ ఉద్యోగం ఎలా వుంది? లాభసాటిగా వుందా?

పాన: [అలా అడగడంలో గూఢార్థం వుందని వణుకుతాడు] అధికార్లు నా పనికి మెచ్చుకున్నారు. నాలుగేళ్ళనాడు ప్రమోషన్ లిస్టులో పడేశారు నా పేరు. కాని ... [చేతిలోవున్న డబ్బు అతనికి కనపడేలా ముందుకు చాపుతాడు]

వసంత: ఏమిటి మీ చేతిలోది?

పాన: ఏంలేదు! ఏంలేదు! [చేయి వణుకుతుంది. డబ్బున్న కవరు కింద పడేస్తాడు]

వసంత: ఏం లేదూ? ఏదో కింద పడేసినట్లున్నావు [దగ్గిరికొచ్చి వంగి కవరు తీసుకుంటాడు]

పాన: ఏంలేదు యువర్ ఎక్సెలెన్సీ!

వసంత: [కవరులోవున్న డబ్బు బయిటికితీసి చూచి] ఏమిటీ? డబ్బా?

పాన: [విపరీతమైన భయం] అవునవును! స్వీకరించండి. యువర్ ఎక్సెలెన్సీ! స్వీకరించండి!

వసంత: [విసిరి అవతల పడేసి, కోపంగా] నాన్సెన్స్! నాకు లంచం ఇద్దామనుకున్నారా! ఎంత ధైర్యం? నే నెవరనుకున్నారు?

పాన: [భయంతో చేతులు నలుపుకొంటూ] మన్నించండి యువర్ ఎక్సెలెన్సీ! లంచమా? ఎంతమాట! తమకు ప్రెజెంటు చేస్తున్నాను. స్వీకరించండి.

వసంత: [కొంచెంతగ్గి] అయితే నే చెప్పేది వినండి. అప్పుగా పుచ్చుకుంటాను. ఢిల్లీ వెళ్ళగానే మీకు చెక్కు పంపిస్తాను.

పాన: ఫరవాలేదు. దాని విషయం ఆలోచించకండి. [డబ్బు కవరు టేబిలుమీద పెడతాడు] తమతో ఒక విషయం మనవి చేయాలని వుంది.

వసంత : ఏమిటది ?

పాన : ఆ హెడ్మాష్టరున్నాడు చూచారూ! అతని నడత మంచిది కాదు. అటు పంతులమ్మలను, ఇటు చదువుకునే ఆడపిల్లలను చెడగొడుతున్నాడు.

వసంత : [సీరియస్‌గా] తెలుసు! నాకంతా తెలుసు! మనసులో మెదులుతూనే వుంది.

పాన : అదే నేనూ కోరేది యువర్ ఎక్సెలెన్సీ! ఆ మాత్రం తెలిసి వుంటే చాలు. ఇహ నాకు సెలవిప్పిస్తారా ?

వసంత : మంచిది. వెళ్ళండి!

పాన : చిత్తం! [నమస్కారంచేసి పోతాడు. అతనుపోగానే వసంతకుమార్ డబ్బుతీసి జేబులోపెట్టుకుంటుంటే హాయగ్రీవం వస్తాడు]

వసంత : [అతనివైపు చూడనట్లు] ఎవరది ?

హాయ : [వినయంగా] తమదర్శనార్థం వచ్చాను. హైస్కూలు హెడ్మాస్టరును.

వసంత : [వ్యంగ్యంగా] అయ్యవార్లంగారూ! తమరు నామం...

హాయ : హాయగ్రీవం!

వసంత : కాదు, కాదు [ముహంమీద నామాలుచూపుతూ] తమరు పంగ నామాలు బాగాపెడతారే ?

హాయ : [అలా అడగడంలో గూఢార్థం వుందని భయపడతాడు] లేదు... లేదు యువరెక్సెలెన్సీ!

వసంత : అయితే అయ్యవార్లంగారూ! నాకోమాట చెప్పండి! తమరు శ్రీ వైష్ణవులా లేక స్త్రీ వైష్ణవులా?

హాయ : [గర్వోక్తులతో] అసలైన శ్రీ వైష్ణవులం.

వసంత : [సీరియస్‌గా] కాదు. చెప్పడానికి సిగ్గుపడుతున్నారు. మీరు సిసలైన స్త్రీ వైష్ణవులు!

హాయ : [మాట్లాడడు. గడగడవణుకు తుంటాడు]

వసంత : [చుట్టముట్టిస్తూ] పోనీ, మరో మాట చెప్పండి. నాకు చుట్ట లంటే చెడ్డప్రీతి. మరి మీకూ? పొరచుట్ట లిష్టమా? దొరసాను లిష్టమా? అయ్యవార్లంగారూ! అరమర లేకుండా చెప్పండి!

హాయ : [సందిగ్ధావస్థలో పడి నీళ్ళు నములుతూ] ఏదీ చెప్పలేకుండా వున్నాను.

వసంత : అయితే నే చెప్తాను వినండి, మీరొక పంతులమ్మకోసం విశ్వప్రయత్నం చేశారు. కాని విఫలులయ్యారు. అవునా?

హాయ : [భయంతో నిజం చెపుతాడు] లేదు యువర్ ఎక్సెలెన్సీ! నన్ను మన్నించండి! నా ఉద్యోగం ఊడగొట్టకండి. ఇంకెన్నడూ అలా చేయను. [కాళ్లా వేళ్లా పడతాడు]

వసంత : సరే, ఈసారికి క్షమించాను. [a pause] ఇదిగో! మీరు నాకో నాలుగువందలు అప్పు పెడతారా? ఢిల్లీ వెళ్ళగానే పంపిస్తాను!

హాయ : నిరభ్యంతరంగా తీసుకోండి. తిరిగి ఇచ్చే విషయం కలలో కూడా ఆలోచించకండి. [డబ్బుతీసి టేబిలుమీద పెడతాడు]

వసంత : సరే మీరిక వెళ్ళండి.

హాయ : చిత్తం. ఒక చిన్న మనవి.

వసంత : ఏమిటది?

హాయ : ఈ ఊరి డాక్టరున్నాడే! అతను మందులన్నీ అమ్ముకుం టున్నాడు. రోగుల్ని చంపుతున్నాడండీ!

వసంత : నాకంతా తెలుసు. మీరేం చెప్పక్కర్లేదు.

హాయ : చిత్తం. సెలవు. [నమస్కరించి వెళ్ళిపోతాడు. వసంతకుమార్ తిరిగి డబ్బుతీసి జేబులో పెట్టుకొని వ్రాసుకుంటూ కూచుంటాడు. కైలాస రావు ప్రవేశిస్తాడు]

కైలాస : గుడ్‌మార్నింగ్ యువర్ ఎక్సెలెన్సీ! తమర్ని దర్శించా లని వచ్చాను.

వసంత : (కన్నెత్తి చూడకుండా, సీరియస్‌గా వ్రాసుకుంటూవుంటాడు.)

కైలాస : (తిన్గా) తమతో కొంచెం మాట్లాడాలి. అనుమతిస్తారా?
వసంత : సైలెన్స్! ఎందుకలా రొదపెడతారు? నేనేం చేస్తున్నానో కన్పించడంలేదూ? ఆరోగ్యశాఖామంత్రికి టెలిగ్రాం ఇస్తున్నాను.
కైలాస : (అది తన విషయమేనని భయపడతాడు. వణుకుతూ) మన్నించండి యువర్ ఎక్సెలెన్సీ! పొరపాటయింది. ఈ ఉద్యోగం పోతే నా కాధారంలేదు.
వసంత : (సీరియస్‌గా) ఏమిటి మీరు చెప్పేది? ఎందుకు లేదూ? మందులమ్ముకున్న డబ్బంతా ఎక్కడ మాయంచేశావయ్యా?
కైలాస : లేదు యువర్ ఎక్సెలెన్సీ! నా దగ్గరున్న డబ్బు యిదే! (డబ్బుతీసి బల్లమీద పెడతాడు) దీన్ని మీరే స్వీకరించి నన్ను కనికరించండి.
వసంత : ఈ డబ్బు నాకెందుకూ? Head of the Medical Department కు పంపెయ్యండి!
కైలాస : అలా కాదు. తమరే స్వీకరించాలి యువర్ ఎక్సెలెన్సీ!
వసంత : అలా అయితే అప్పుగా యివ్వండి. తీసుకుంటాను. ఢిల్లీ వెళ్ళగానే మీకు T. M. O. చేస్తాను.
కైలాస : అక్కర్లేదు. తమ అనుగ్రహంవుంటే అదే పదివేలు. నే నెప్పుడూ ఉద్యోగధర్మం తప్పి ప్రవర్తించలేదు. చిన్న మనవి చేసుకుందామని వచ్చాను. ఆ మాజిస్ట్రేటు నడతను గురించి ఏం చెప్పడానికీ నోరు రావడంలేదు. అతని దుర్నడతవల్ల నాబోటివాళ్ళందరికీ నలుగురిలో తలవొంపులుగావుంది. ఆ హెడ్మాస్టరున్నాడు చూచారూ? అత నొక వీర కమ్యూనిస్టు. ఇహ ఆ పోస్టుమాస్టరు టపాలు పంపకుండా టలాయిస్తున్నాడు.
వసంత : (వ్రాసుకుంటూ) అవును. ఈ విషయాలన్నీ ఒక స్టేటుమెంటు వ్రాసి ఇవ్వండి. వాళ్ళ భరతంపడతాను.
కైలాస : చిత్తం. అలాగే.
వసంత : ఇహ వెళ్ళండి.

కైలాస : చిత్తం. సెలవు. (వెళ్లిపోతాడు. వసంతకుమార్, బల్లమీదున్న డబ్బుతీసి జేబులో పెట్టుకుంటాడు. అంతలో మిరియాలు, ధనియాలు ప్రవేశిస్తారు.)

మిరి : అయ్యగారికి నా వందనాలు. ఊళ్లో షావుకారును. నా పేరు మిరియాలు !

ధని : అయ్యగారికి నా వందనాలు. నేనూ షావుకారునే. నా పేరు ధనియాలు !

వసంత : (మిరియాలుతో) నేను మిమ్మల్ని చూచాను. మీ ముక్కుమీద దెబ్బతగిలింది కదూ ? ఎలావుంది గాయం ?

మిరి : శ్రీవారు దాన్నిగురించి విచారించకండి. మీ దయవల్ల పూర్తిగా మానిపోయింది.

ధని : నిన్న హోటల్లో నన్నుకూడామీరు చూచారు అయ్యగారూ !

వసంత : అవును. మిమ్మల్నికూడా చూచాను. [A pause] ఇదిగో ! మీదగ్గర డబ్బేమైనా ఉందా ?

ధని : (కొత్తరపోయి) ఏమిటీ !...డబ్బా ?...ఎందుకూ !

వసంత : ఓ వెయ్యిరూపాయిలు నాకు అప్పు పెడతారా ?

మిరి : చిత్తం ! చిత్తం !......వెయ్యి రూపాయిలే ! ఏంరా ధనియాలూ ! నీదగ్గరకూడా లేవనుకుంటాను.

ధని : అవునురా! నా దగ్గరా లేదే! (వసంతకుమార్‌తో) అయ్యగారూ! నా డబ్బంతా బ్యాంకులో దిగబడిపోయిందండీ !

వసంత : పోనీ వెయ్యిరూపాయిలు లేకపోతే, ఒక వందవున్నా చాలు. తీసుకుంటాను.

మిరి : (జేబులో వెదుకుతూ) ఏం రా, ధనియాలూ ! నీదగ్గర వంద వున్నాయా ? నా జేబులో నలభైరూపాయిలే వున్నాయి. అవి కూడా నోట్లు.

ధని : (జేబులు వెదుకుతూ) నా దగ్గర పాతికరూపాయి లున్నాయిరా ! అంతే !

మిరి : మళ్ళీ చూడరా, ధనియాలూ! నీ చొక్కాకు లోపల దొంగజేబుందిగా! అందులో వున్నాయేమో చూడు.

ధని : అందులో ఏం లేవురా.

వసంత : పోనీయండి. మీదగ్గర 65 రూపాయ లున్నాయికదూ? అంతే యివ్వండి. అంతకన్నా లేనప్పుడు ఏం చేస్తాం?

మిరి : చిత్తం, చిత్తం! (ఇద్దరూ డబ్బుతీసి, నే నిస్తానంటే నే నిస్తానని పోటా పోటీపడి యిస్తారు.)

ధని : శ్రీవారిని చిన్న సహాయం అడగాలనుకుంటున్నా. చాల చిక్కుల్లోవున్న వ్యవహారం.

వసంత : ఏమి టది?

ధని : పెళ్ళి కాకముందే నాకు ఒకకొడుకు పుట్టాడు. వాడే మా పెద్దబ్బాయి.

వసంత : అయితే?

ధని : (తత్తరపాటుతో) చిత్తం. నిజంచెప్పాలంటే ఆ పిల్లవాడు నాకే పుట్టాడు. ఆ తరువాత నాకూ, నా భార్యకూ గర్భాదానం తంతుకూడా జరిగింది. ఇహ చూచారూ? ఆ పిల్లవాడికి 'లా' ప్రకారం నేనే తండ్రిని కావాలని నా కోరిక. అంటే ఆపిల్లవాడు ఉల్లిపాయల ధనియాలు కొడుకు.

వసంత : అవును. వాడు మీ కొడుకే! మీ కొడుగ్గానే వుండ నీయండి. ఇందులో వచ్చేయిబ్బంది ఏముంది?

ధని : మన్నించండి. శ్రీవారికి శ్రమ కలిగిస్తున్నాను. అసలు విషయం ఏమిటంటే, అలా ఆ కుర్రవాడు నా కొడుగ్గా వుండ డానికే పెద్దచిక్కొచ్చిపడింది. ఊళ్ళో అంతా వాడు నాకు పుట్టినవాడు కాదంటారు! చూడండి! ఏం న్యాయమో? వాడు సామాన్యుడుకాడు. వరప్రసాది! వాడిమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. వాడెంత చురుకైనవా డనుకున్నారూ? ఏదైనా ఒకసారి వింటేచాలు. పెసరట్టు పెనానికి అంటుకున్నట్టు

వాడిబుద్ధికి అంతలావు విషయం గట్టిగా కరుచుకపోతుంది. పెన్సలు చేతికిస్తే చాలు, కాగితంమీద చిత్రవిచిత్రమైన బొమ్మలు చిత్రిస్తాడు. ఏంరా? మిరియాలూ! నా మాట అబద్ధమా?

మిరి: అవును ... (a pause) వాడు కత్తిలాంటి కుర్రాడు!

ధని: చూడండి! అలాంటి వంశాంకురాన్ని నాకు కాకుండా చేస్తున్నారు.

వసంత: మరేం భయంలేదు. వాడు మీ కొడుకేనని జడ్జిమెంటు యిస్తాను, యిహ వెళ్ళండి.

మిరి: శ్రీవారు చిత్తగిస్తే నాదో చిన్నమనవి.

వసంత: ఏమిటది?

మిరి: నాకో రావుబహద్దూర్ బిరుదు పారేయండి!

వసంత: రావుబహద్దూరే!

మిరి: అవును అయ్యగారూ! ఊళ్ళో ఎక్కడికిపోయినా నాకు కుర్చీ వేయరు, కూర్చోమనరు. ఆ బిరుదుకాస్తా పారేశారూ అంటే మీ పేరు చెప్పుకుని బ్రతుకుతాను.

వసంత: సరే. అలాగే పెట్టుకో!

మిరి: చిత్తం. శ్రీవారు ఢిల్లీ వెళ్లింతరువాత అక్కడ తమ స్నేహితులతోటీ, మంత్రులతోటీ, గొప్ప గొప్ప వాళ్ళందరితోటీ, 'ఫలానాఊళ్ళో రావుబహద్దూర్ ఉల్లిపాయల మిరియాలనే పాపుకారున్నాడు' అని చెప్పి నా పేరు ప్రచారంచెయ్యండి.

ధని: అవును. నా పేరూ ప్రచారంచెయ్యండి.

వసంత: ఓ యస్. తప్పకుండ. ఇహ వెళ్లండి!

మిరి: మరిచిపోకండి. నాపేరు మిరియాలు.

ధని: మరిచిపోకండి. నాపేరు ధనియాలు.

మిరి: మా ఇంటిపేరు ఉల్లిపాయలవారు.

ధని: మా ఇంటిపేరూ అదే. మే మిద్దరం అన్నదమ్ములం.

మిరి: అవును. ఒక తల్లి పిల్లలం. కాదు కాదు. ఒక తండ్రి పిల్లలం!

ధని : మా నాయన మూడుపెళ్ళిళ్లు చేసుకున్నాడు. మొదటి సంబంధానికి (మిరియాలును చూపుతూ) వీడూ !

మిరి : మూడో సంబంధానికి (ధనియాలును చూపుతూ) వాడూ పుట్టాం.

ధని : శ్రీవారు తీరుబడిగా వున్నప్పుడు మా కథంతా ఒక పుస్తకం రాయండి.

మిరి : మా పేర్లు మాసిపోకుండా చూడండి.

వసంత : (వాళ్ళింకకూ వెళ్ళకుండా వాగుతున్నందున) మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను.

ధని : చిత్తం, చిత్తం ! ... అరెస్టే ! అమ్మబాబోయ్ ! (భయంతో మిరియాలును కరుచుకుంటాడు)

మిరి : చచ్చాంరా, దేవుడా ! (ధనియాలును కరుచుకుంటాడు.)

వసంత : గెటౌట్ ! యూ ఇడియట్స్ ! (ఇద్దరూ పారిపోతారు) మిరియాలు, ధనియాలు; చారుపొడి వెధవలు ! (డబ్బంతా జేబులో సర్దుకుని, అంతవరకూ వ్రాసిన ఉత్తరాన్ని కవరులోపెట్టి అంటిస్తాడు. అడ్రెస్ వ్రాస్తాడు. అంతలో చక్రపాణి గబగబ ప్రవేశిస్తాడు.)

చక్ర : ఇహ మనం యిక్కణ్ణుంచి ఎంతత్వరగా ఉడాయిస్తే అంత మంచిది. ఇప్పటికే చాలా గ్రంథం నడిచింది. నిజంగా అసలు ఆఫీసరు ఎవడో వచ్చాడూఅంటే మనపని ఖాళీ ! దేహశుద్ధి కూడా అవుతుంది.

వసంత : ఇక్కణ్ణుంచి వెళ్లబుద్ధివెయ్యడం లేదోయ్ ! పోనీ, రేపు వెళ్లకూడదూ ?

చక్ర : వద్దు వద్దు. చేజిక్కింది చాలు. ఎవడూ కనుక్కోకముందే తెలివిగా బయటపడదాం పదండి.

వసంత : సరే. ముందీ లెటరు పోస్టులో నెయ్యి ! మన సామానంతా సర్ది ప్రయాణానికి సిద్ధంచెయ్యి. పోతే, మంచి గుర్రబ్బండి మాట్లాడు. బండి ఎలా వుండాలో తెలుసా ? పెళ్ళివారి బండిలా వుండాలి. బాడుగ మనం ఇవ్వమని చెప్పు. ఆ ఖర్చులన్నీ ప్రభుత్వంవారే భరిస్తారని చెప్పు. ఊ ! త్వరగా వెళ్ళు !

చక్ర: (వెడతాడు. వసంతకుమార్, కాగితాలు వగైరా సర్దుకుంటుంటాడు. అంతలో వీధిలోంచి కేకలు, అరుపులు వినిపిస్తాయి.)

కానిస్టేబులు: (బయటినుంచి) మీాకే చెప్పేది! ఎవరైనాసరే. దొర గారి ఉత్తర్వులేదు. అడుగు ముందుకువేశారా! తల లెగురు తాయి, జాగ్రత్త!

అనేక గొంతులు: (బయటినుంచి) మమ్మల్ని లోపలికి పోనివ్వు. నీవు ఆపడానికి వీల్లేదు. మాకు దొరగారితో పనుంది.

కానిస్టేబుల్: వీల్లేదు. వెళ్లండి! దొరగారు మిమ్మల్నిచూడరు. పనిలో వున్నారు. (వసంతకుమార్, ఈ అరుపులు విని కంగారుపడు తుంటాడు. అంతలో చక్రపాణి బయటినుంచి పరుగెత్తుకుంటూ వస్తాడు.)

వసంత: చక్రపాణీ! ఏమిటాగోల?

చక్ర: కొంపమునిగింది. బయట చాలమందిజనం గుంపుకూడారు. లోపలికి రావాలని తోసుకుంటున్నారు. పోలీసులు వాళ్ళను అడ్డ గిస్తున్నారు.

వసంత: ఎవరువాళ్లు? ఎందుకొచ్చారు?

చక్ర: చాలమంది అలగాజనం! రోడ్లు ఊడ్చేవాళ్ళు, దూది మరలో పనివాళ్లు, కూలీలుఅంతా వున్నారు. కొందరు వర్తకులు కూడా వున్నారు. పిటీషన్లు తీసుకొచ్చారు. మిమ్మల్ని చూడా లంటున్నారు.

వసంత: సరే అర్థమైంది. మరేం భయంలేదుగాని, నీవువెళ్ళి ఒక పనిచేయి. ఆఫ్యాక్టరీ వర్కర్సునుమాత్రం లోపలికి రానీయవద్దు. వాళ్ళతో ప్రమాదం. పైగాడబ్బుకూడా రాలదు. ఆ వర్తకుల్లో ముఖ్యుల్ని ప్రవేశపెట్టమని కానిస్టేబుల్‌తో చెప్పు. ఊ! త్వరగా వెళ్లు! (చక్రపాణి వెడతాడు) (అంతలో ఎవరో, కిటికీలోంచి లోపలికి కాగితం విసురుతారు. వసంతకుమార్ దాన్ని తీసుకుని చదువుతాడు.)

'మహారాజరాజశ్రీ రాజమాన్య రాజపూజితులు, గౌరవ నీయులు, అయిన ఇన్‌స్పెక్టరు దొరవారి దివ్యసముఖమునకు – పట్టణ వర్తకసంఘం ప్రెసిడెంటు భూషయ్య అనేక వందనములు

చేసి వ్రాసుకున్న విన్నపం! ఘనమైన అయ్యా!' [చదవడం ఆపి] ఏమిటీ బిరుదులన్నీ? బుద్ధిలేని వెధవలు! (కాగితం అవతలపడేస్తాడు)

[ఇంతలో చక్రపాణి, భూషయ్యను, శేషయ్యను వెంటబెట్టుకు వస్తాడు. వాళ్ళదగ్గర పండ్లబుట్టలుంటాయి. వినయంగా నమస్కరిస్తారు.]

భూష: దొరవారికి మా దణ్ణాలు!

శేష: ధర్మ ప్రభువులు రక్షించాలి! [ఇద్దరూ చేతులు కట్టుకుని నిలుచుంటారు.]

వసంత: [సీరియస్‌గా] ఎందుకొచ్చారు?

భూష: చిన్నమనవి. ఈ ఊళ్ళో మేము బ్రతికేటట్లులేదు. ఆ దుర్మార్గుడు మా ప్రాణాలు తీస్తున్నాడు?

వసంత: ఎవరు? ఏ దుర్మార్గుడు?

భూష: ఇంకెవరు? చైనులుగారు. ఈ ఊరి అధికారి. అతని దుర్మార్గాలు అన్నీ ఇన్నీ కావు. మా అంగళ్ళమీాది కెగబడి ఏది కనపడితే అది ఎత్తుకపోతాడు. గుడ్డ కంటికి కనపడితేసరి, బ్రతకనివ్వడు.

శేష: కోటా రావడమే ఆలస్యం. కొట్లోదూరి 'భలేగుడ్డవచ్చిందే! మా ఇంట్లోకి కావాలి' అంటూ జవాన్లచేత తానులు తానులు పట్టించుక పోతాడు.

భూష: ఖరీదుగల పట్టుచీరెలు శాంపిల్‌కోసం బయటపెడితే, ఆడ వాళ్ళకు చూపిస్తానని పట్టుకపోయి మళ్ళీపంపడు. ఆ చీరేరాను, చీరెకిమ్మత్తూరాను.

వసంత: వట్టి స్కౌండ్రల్‌లా వున్నాడే!

శేష: లంచం పోస్తేనేగాని బట్టలకొట్టుకు లైసెన్సు ఇవ్వడు.

భూష: ప్రతి పండక్కూ వచ్చి ప్రెజంటు ఇవ్వమని కూచుంటాడు.

శేష: ఆయనకు రోజూ పండగే!

భూష: కూతురు పుట్టినరోజంటాడు.

శేష: భార్య నీళ్ళాడింది, భారసాల అంటాడు.

వసంత: అరె! దోపిడిదొంగలా వున్నాడే!
భూష: మా అంగళ్ళముందు అరుగులు తీసేయిస్తాట్ట!
శేష: మా ఇళ్ళముందు పందిళ్ళు వేసుకోకూడదట!
భూష: పన్నులు వేయిస్తాట్ట!
శేష: కొల్లు మూయిస్తాట్ట!
భూష: అదేమని అంటే కస్సుమంటూ లేచి కర్ర పైకెత్తుతాడు.
శేష: ఎదురుతిరిగామా, మాతలలు ఎగిరా యన్నమాటే!
భూష: పోలీసులతో కాల్పిస్తాట్ట.
వసంత: ఎంత దుర్మార్గుడు! ఇలాంటివాళ్ళను రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపాలి.
భూష: తమ రాయన్ను ఎక్కడికైనా పంపండి. మాకవసరంలేదు. మా ప్రాణాలుమాత్రం కాపాడండి. లేదా, పిల్లాజెల్లతో తరతరాలుగావున్న ఈ ఊరువదిలిపెట్టి దేశాలమీదపోతాం.
వసంత: సరే. మీరు వెళ్ళండి. అతని అంతునేను కనుక్కుంటాను.
భూష: అయ్యగారూ! తమ కోసం పళ్లూ, ఫలాలు తెచ్చాం. స్వీకరించండి. [పండ్లు ఇవ్వబోతాడు]
వసంత: వద్దువద్దు. నేను లంచాలు పుచ్చుకోను.
భూష: లంచాలు కాదు అయ్యగారూ! పేదవాళ్ళం. ప్రీతికొద్దీ ఇస్తున్నాం. పుచ్చుకోండి.
వసంత: వద్దువద్దు. నేను లంచాలు పట్టేవాణ్ణికాదు. మీకిష్టమైతే ఓ అయిదొందలు అప్పుపెట్టండి. అదిబావుంటుంది.
శేష: అంతకన్నానా? తీసుకోండి. ఆచండ శాసనుడు చైనులుపెట్టే బాధలనుండి మమ్మల్ని తప్పించండి. [వెండిపళ్ళెంలో 500 రూపాయలు పెట్టి ఇస్తాడు]
వసంత: చక్రపాణీ! అవి తీసుకో.
చక్ర: [డబ్బుతీసుకొని, వస్తువులతో] ఆ వెండి పళ్ళెంకూడా అట్టె పెట్టండి. అయ్యగారు భోంచేయడానికి కావాలి.

శేష: అలాగే పుచ్చుకోండి.

భూష: ఈ పండ్లు కూడా పుచ్చుకోండి. మామనసుకు తృప్తిగా వుంటుంది.

వసంత: వద్దువద్దు. అలాంటి లంచాలు పుచ్చుకోవడం నాకలవాటు లేదు.

చక్ర: [వసంతకుమార్‌తో] ఏం? ఎందుకు తీసుకో కూడదు అయ్యగారూ! [వర్తకులతో] ఇలా ఇవ్వండి. దారిలో ఫలహారం చేయడానికి పనికొస్తాయి. ఆ బుట్టలు కూడా ఇవ్వండి. పట్టుకపోవడానికి వుంటుంది. అదేమిటి? తాడా? అదికూడా ఇవ్వండి. ప్రయాణంలో దేనికైనా అక్కర కొస్తుంది. [అన్నీ తీసుకుంటాడు.]

వసంత: ఇహ మీరు వెళ్ళండి.

శేష, భూష: చిత్తం! సెలవు తీసుకుంటాం [ఇద్దరూ వెళ్ళి పోతారు]

(ఇంకా బయటినుంచి అలజడి వినిపిస్తుంది. చక్రపాణి కిటికీ వద్దకు వెడతాడు)

చక్ర: మీరంతా వెళ్ళండి. ఇవాళ అర్జీలు తీసుకునే టైము అయిపోయింది. మీరంతా రేపురండి! వెళ్ళండి! వెళ్ళండి!

(బయట సద్దుమణుగుతుంది. చక్రపాణి, పళ్ళూ వగైరాలు తీసుకుని లోపలికెడతాడు. వసంతకుమార్ కూడా లోపలిగదిలోకి వెడతాడు. మళ్ళీ చక్రపాణి బయటికి వెడతాడు. తిలకం ఇంట్లోంచి ప్రవేశిస్తుంది)

తిల: సుబ్బన్నా! సుబ్బన్నా!

వసంత: [గదిలోంచి ఇవతలికొచ్చి ఆమెను చూస్తాడు సమీపించి)

వెలదీ! ఎవ్వతెవీవు?

* తలిరాకు జొంపములసం
దులతో వలనేలవాలు, తుహిన కిరణకో
మల రేఖవో! పువుదీవవో!
వెలదీ! ఎవ్వతెవీవు?

తిల: [సిగ్గుతో మౌనంవహిస్తుంది]

---

* ఈ పద్యపాదములు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారివి. వారికి నా కృతజ్ఞత.

వసంత : [తిస్గి] పద్యంలో అడిగితే నీకు బోధపళ్ళేదా! పోనీ, Simple Prose లో అడుగుతాను. మనం ఇక్కడికి ఎందు కొచ్చినట్లు? హాయిగా ఒకరినొకరం చూచుకుందామా? పలక రించుకుందామా? కాసేపు ప్రేమించుకుందామా?

తిల : కాసేపు ప్రేమ ఏమిటీ? అసహ్యంగాను!

వసంత : పోనీ అస్తమానం ప్రేమించుకుందాం, ఇంచక్కా!

తిల : ఏమిటో, మీమాటలూ, మీరూ! అంతా కవిత్వం! నాకేం తెలీడంలేదు.

వసంత : తెలుస్తుంది, తెలుస్తుంది. చూచావూ? ప్రేమ అనేది మొదట్లో తెలీనట్లుంటుంది. ఆ తరువాత తెలిసీ తెలీనట్లు వుంటుంది. అటుపిమ్మట తెలుస్తుంది. తెలిసింతరువాత తియ్యగా తేనెలా వుంటుంది. అందుకే ప్రేమకు సాధన అవసరమన్నారు పెద్దలు. అలా సాధించిన ప్రేమను ఆరాధించమన్నారు మన రుషిపుంగవులు. మన మింకా సాధనలోనే వున్నాం. ఆరాధన లోకి వచ్చిన తరువాత ఇలా వుండం. నీవే నేను! నేనే నీవు! (అంటూ, తిలకం పరికిణీచెంగులు పట్టుకుని మోకాల్లుతాడు. ఆమె అతన్ని తప్పించుకుని అవతలకిపోతుంది. అలాచేయడంలో ఆమెపాదం అతని తలకు తాకుతుంది) ఆహా! మల్లెపువ్వుల గుత్తా! పట్టుకుచ్చా! మలయ మారుతమా! నాతల తాకినది!

తిల : [పరిహాసంగా] ఆడవాని కాలు!

వసంత : కాదుకాదు! మన్మధుడి వాడివాలు! ఇది ఆ శ్రీకృష్ణ పరమాత్మ అంతటివాడికే తప్పలేదు. మానవమాత్రులం మన మెంత? [కళ్ళుమూసుకుని చేతులు చాపి]

♦ నను భవదీయదాసుని మనంబున నెయ్యపు గిన్కబూని తా
చినయది, నాకు మన్ననయ, చెల్వగు నీ పదపల్లవంబు మ

---

♦ ఈ పద్యం పారిజాతాప హరణంలోనిది -

త్తను పులకాగ్ర కంటకవితానము దాకిన నొచ్చునంచు నే
ననియెద, నల్కమానవుగదా, ఇకనైన నరాళకుంతలా!

(అతనలా పాడుతూవుండగా కోమలమ్మ వస్తుంది. ఆమెను చూచి తిలకం భయంతో పారిపోతుంది.)

కోమ: [అతన్ని సమీపించి] అయ్యో, కర్మ! ఏమిటిది? లేవండి! ఎవరన్నా చూస్తే నవ్విపోతారు.

వసంత: [ఇంకా కళ్ళుమూసుకునే] అలా జాలివహించు! ఈ ప్రేమికుణ్ణి కనికరించు. బాలా! నీవులేని జీవితమదేలా?

కోమ: బాలను కాదండీ బాబూ! చైనులుగారి భార్యను!

వసంత: [కళ్ళుతెరిచి ఎగాదిగా చూస్తాడు. తమాయించుకుని] భార్యేమిటి? భార్యంటే భరింపబడేది. ఒకర్ని మరొకరు భరించడమేమిటి? దుర్భరం! దుర్భరం! లోకంలో ప్రేయసీ, ప్రియుడు! వీరిద్దరే! ఆ ప్రేమవిలాసమే జీవితం!

కోమ: మీ వ్యవహారం నా కర్థంకావడంలేదు. మీరు మా అమ్మాయిని ప్రేమిస్తున్నారా?

వసంత: అవును......కాదు......మిమ్మల్నే!

కోమ: అయ్యో, కర్మా! నేనొక ఇల్లాలునండీ! నన్నిదివరకే ఒకాయనకు కట్టబెట్టారు.

వసంత: ఏం ఫరవాలేదు. ఈ పెళ్ళిళ్ళు, సంసారాలు, లాంఛనాలు! పవిత్ర ప్రేమికులను ఈ ఆచారాలు బంధించవు!

(తిలకం పరుగెత్తుకుంటూ వస్తుంది)

తిల: అమ్మా, అమ్మా! నాన్న...

కోమ: [కోపంగా] ఏమే, తిలకం! నీకు బుద్ధి లేదూ? ఏమిటా చేష్టలు? పద్దెనిమిదేండ్లు నెత్తిమీదికొచ్చాయి. ఇంకా నీకెప్పటికి తెలివివస్తుందే? ఆయనగారు నిన్నుచూచి ఏమనుకుంటారు?

తిల: [బిక్కమొహంపెట్టి] అదికాదమ్మా! నేనూ...

కోమ: ఇహ నోరుమూసుకోవే మొద్దూ! నీ మట్టిబుర్ర కేమీ అర్థం కాదులే.

వసంత : [తిలకం పక్కకి వెళ్ళి నిలుచుని] అత్తగారూ! ఇహ మా ఆనం దానికి అడ్డురాకండి. మేమిద్దరం పెళ్ళిచేసుకుంటాం. ఆశీర్వ దించండి.

సోమ : ఒహో! అదా సంగతి? ఇంతకూ మా తిలకం కావాలన్న మాట మీకు? [కూతురితో] ఒసేవ్! తెలివితక్కువదానా! నీమూలంగానే ఆయన నాకాళ్ళమీద పడ్డారు.

[చైనులు, లోపల్నుంచి రొప్పుతుంటూ ప్రవేశిస్తాడు]

చైనులు : యువర్ ఎక్సెలెన్సీ! నన్ను రక్షించండి.

వసంత : ఏమిటది?

చైనులు : ఆ వర్తకులు, ఫ్యాక్టరీ కూలీలు తమ దగ్గిరికొచ్చి నా మీద కంప్లయింట్సు చేశారు. అవన్నీ అబద్ధాలు. అందులో సగంకూడా నిజంలేదు. వాళ్ళే తప్పుడుకొలతలు కొలిచి, తప్పుడు తూకాలువేసి ప్రజల్ని మోసగిస్తున్నారు. ఆ ఫ్యాక్టరీ కూలీలు గూండాలు. వాళ్ళే సమ్మెలుచేసి జీతాలు రావాలంటారు. వాళ్ళమీద నేను కాల్పులు జరిపించలేదు. ఎవరిదగ్గర లంచాలు పుచ్చుకోలేదు. ఎవర్నీ కొట్టించలేదు. అన్నీ అబద్ధాలు!

వసంత : ఎవర్ని కొడితే మాత్రం నాదేం పోయిందయ్యా!

చైనులు : తమరివేవీ నమ్మకండి. వాళ్ళంతా రౌడీలు!

సోమ : [భర్తతో] ఏమండోయ్! ఆ గొడవంతా పోనీయండి. ముందిదివినండి! ఆఫీసరుగారు మన అమ్మాయిని పెళ్ళి చేసు కుంటానన్నారు.

చైనులు : [భార్యతో] నీకు పిచ్చిపుట్టిందా ఏమే? ఏంమాటలవి! [వసంతకుమార్‌తో] తమరు ఆగ్రహించకండి. అది తెలివితక్కువ మనిషి. అంతావాళ్ళ అమ్మపోలిక!

వసంత : అవును. ఆమె చెప్పింది వాస్తవమే. నేను మీ అమ్మా యిని పెళ్ళి చేసుకోవడానికి నిశ్చయించుకున్నాను.

చైనులు : తమమాటలు వింతగా వున్నాయి యువర్ ఎక్సెలెన్సీ! తమరలా అంటేమాత్రం ఎవరు నమ్ముతారు?

కోమ : [భర్తతో] అయ్యో, అయ్యో! నీకర్మకాల. ఇంతచదువు చదువుకున్నారేకాని, మీకు మెదడులేదేమండీ! ఆయనగారు అంత స్పష్టంగా చెప్తుంటే, ఇంకా మీబుర్ర కర్థంకాలేదూ?

వసంత : [కోమలమ్మతో] బహుశా నేను మీ అల్లుణ్ణికావడం ఆయన కిష్టంలేదు. మర్యాదగా తప్పించుకుంటున్నారు. పోనీయండి. మీరు మీపిల్ల నివ్వకపోతే పిస్తోలుతో కాల్చుకుంటాను.

చైనులు : వద్దు వద్దు. తమరలా అనకండి. వేరే అభిప్రాయం నాకు ఏకోశానా లేదు. మొదట్లో అర్థంకాక అలా అన్నాను. నాకు మతిపోయింది. తమవంటి మహానుభావుడు నాకు అల్లుడైతే ఇహ నాజన్మ కేంకావాలి? నావంశం తరించింది. రేపే బ్రాహ్మణ్ణిపిలిచి ముహూర్తం పెట్టిస్తాను. మా అమ్మాయిని తమకిచ్చి వైభవోపేతంగా వివాహం జరిపిస్తాను.

కోమ : ఇంకా అట్లాచూస్తారేం? వాళ్ళను ఆశీర్వదించండి.

[వసంతకుమార్, తిలకం, చైనులుకు నమస్కరిస్తారు]

చైనులు : మీప్రేమ దినదిన ప్రవర్థమానమై, కొడుకులు కూతుళ్లు కలిగి అష్టైశ్వర్యాలతో ఆయురారోగ్యాలతో జీవించండి.

[అతను ఆశీర్వదించిన తరువాత తిలకం లోపలికి వెళ్ళిపోతుంది. పిమ్మట వసంత కుమార్ కూడా మెల్లగా ఆమెను అనుసరిస్తాడు. చైనులు, కోమలమ్మ హర్షించి వాళ్ళు వెళ్ళినవైపు చూస్తారు]

చైనులు : చూడవే వాళ్ళెంత ముచ్చటగా వున్నారో. ఒక్కక్షణ మైందో కాలేదో, ఆ కిలకిలలు, ఆ కేరింతలు!

కోమ : అంతేనయ్యా? ప్రేమంటే ఏమిటనుకున్నావు? ఒక్కక్షణం చాలదూ? అందరూ నీలాగే వుంటారా? ఇప్పుడు వాళ్లు ఒక నిముషంకూడా వేరుగా వుండలేరు.

చైనులు : [పొంగిపోతూ] ఎలాంటి అల్లుడు దొరికాడేమనకు! మనం పువ్వులపూజ చేసుకున్నాం కోమలీ! ఆకారానికి మన్మథుడు.

బుద్ధికా బృహస్పతి. ధనానికా కుబేరుడు. పదవికా దేవేం ద్రుడు! ఏంకావాలి ఇంతకన్నా! ఎంతలో ఎంతమార్పు! చైనులూ! నీవు నిజంగా అదృష్టశాలివోయ్! అనుకున్నదొకటి, జరిగింది మరొకటి!

కోమ: సరే సరే! ముందాసిద్ధాంతికి కబురుపెట్టండి. బోలెడంత భారం నెత్తిమీదుంది. పెళ్ళి పనులు ప్రారంభించాలి.

[చక్రపాణి బయటినుంచివస్తాడు]

చక్ర: అయ్యగారూ? అయ్యగారూ! [వసంతకుమార్ లోపల్నుంచి వస్తాడు] బండిసిద్ధంగావుంది.

వసంత: [చక్రపాణితో] ఒక క్షణంలో వస్తాను.

చైనులు: [ఆశ్చర్యంగా] ఏమిటీ? ఎమిటిది? తమరెక్కడికి ప్రయాణ సన్నాహం చేస్తున్నారు?

వసంత: [చైనులుతో] అవును. అర్జంటుగా వెళ్ళాలి.

చైనులు: మరి తమరు.. అంటే నా ఉద్దేశ్యం...వివాహం శాస్త్రో క్తంగా జరిపించాలి కదా?

వసంత: అవును. దాని కేం అభ్యంతరం వుంది? ఒక్కరోజు. రేపీ పాటికి తిరిగొస్తాను. దగ్గరలోనే మా మేనమామగారున్నారు. వారితో కూడా ఈ వివాహవిషయం చెప్పి వారి ఆశీర్వచనం తీసుకుని వస్తాను.

చైనులు: చిత్తం. తమరు సాధ్యమైనంత త్వరలో వచ్చేయాలి. ఇంకా తమ సమక్షంలో చాలా సంగతులు మాట్లాడాల్సివుంది. ఒక్కగాన ఒక్కపిల్ల! ఒక్క కార్యం! చేయబోయి చేయబోను. వివాహం అన్నిహంగులతో వైభవంగా జరిపిద్దామనుకుంటున్నా. తమరు వెంటనే రావాలి.

వసంత: ఓ! రేపే వచ్చేస్తాను. కాని కట్నంవిషయం మాట్లాళ్ళేదే?

చైనులు: దాని కేముంది? తమ యిష్టప్రకారం పోవడానికి సిద్ధంగా వున్నా.

వసంత: ముందొక వేయిరూపాయలు అడ్వాన్సు యిప్పించండి! వచ్చిన తరువాత కట్నంలో లెక్క-కట్టుకుందాం.

చైనులు: అలాగే. [డబ్బు తీసి] ఇవిగోండి! Bank నుండి తెప్పించా. కొత్తనోట్లు.

వసంత: [డబ్బు తీసుకుంటూ] అంతా మీ అమ్మాయి అదృష్టం. సరే, మామగారూ! ఇహ నాకు సెలవిప్పించండి. తమరిచ్చిన ఆతిథ్యం, తమరు చూపిన అనురాగం, ఆదరణ ఎప్పటికీ మరచిపోలేను. ఇలాంటి సత్కా-రాన్ని నా జీవితంలో ఎన్నడూ పొందలేదు. నాకెంతో ఆనందంగా వుంది. [కోమలమ్మతో] అత్తగారూ! నా మనఃపూర్వక నమస్కా-రాలు! దయవుంచండి. [తిలకంతో] తిలకం! మై డియర్! వెళ్ళొస్తా! దిగులుపడకు. రేపీపాటికి వచ్చి నీ వాళ్ళో వాలుతాను.

చక్ర: [తొందరచేస్తూ] అయ్యగారూ? ఏమిటి ఆలస్యం? గుర్రబ్బండి సిద్ధంగా వుంది.

చైనులు: [వసంతకుమార్‌తో] తమరు గుర్రబ్బండ్లో వెడుతున్నారా? వద్దు. బాగుండదు. మన టాక్సీ తీసుకెళ్ళండి.

వసంత: వద్దు; వద్దు. దోవ మంచిదికాదు. ఆ డొంకల్లో టాక్సీ దెబ్బతింటుంది. గుర్రబ్బండి బెటర్!

చైనులు: అయితే, వుండండి! ఒరేయ్ సుబ్బన్నా! [సుబ్బన్న వస్తాడు] ఆ కొత్తపరుపు తెచ్చి బండ్లో వెయ్యి. రెండు దిండ్లు కూడా పట్టుకరా! [సుబ్బన్న లోనికి వెడతాడు. చైనులు, వసంతకుమార్‌తో] తమరు కూచున్నా, పడుకున్నా సుఖంగా వుంటుంది.

[సుబ్బన్న, పరుపు, తలగడలు తీసుకునివస్తాడు. చక్రపాణి వాటిని అందుకుని బయటికి వెడతాడు]

చైనులు: తమ దర్శనం మళ్ళీ ఎప్పుడన్నారూ?

వసంత: [వెడుతూ] ఎప్పుడేముంది? రేపే!

చైనులు: ఈ లోపల పెళ్ళిపనులు ప్రారంభిస్తాం.

వసంత : అవశ్యం కానీయండి.

కోమ : త్వరగా రండి ! మా తిలకం దిగులుపడుతుంది.

[వసంతకుమార్ వాకిట్లోకి వెడతాడు. చైనులు, కోమలమ్మ, తిలకం వాకిట్లో నిలబడతారు.]

చైనులు : యువర్ ఎక్సెలెన్సీ ! ఇహ నే నుంటాను. నమస్కారం.

వసంత : [బండి ఎక్కుతూ] నమస్కారం మామగారూ ! అత్తగారూ ! నమస్కారం ! తిలకం ! టా, టా !

కోమ : నమస్కారం.

తిల : నమస్కారం.

[అందరూ అతను వెళ్ళిన దిక్కుకు చూస్తూవుండగా]

[ తెర ]

# అయిదో రంగము

[మరుసటిరోజు. రంగస్థలం అదే. తెరలేచేసరికి చైనులు, అతని భార్య కోమలమ్మ, కూతురు తిలకం, స్టేజిమీద కనిపిస్తారు.]

చైనులు: కోమలీ! నీ వెప్పుడైనా యిలా జరుగుతుందని అనుకున్నావూ? చివరకు మన కెలాంటి సంబంధం కుదిరిందో చూడు. నీ వేదో మామూలు ఉద్యోగస్థుడు చైనులు భార్యనే అనుకున్నావుగాని, యిలాంటి గొప్ప ఆఫీసరుకు అత్తగారినవుతానని కలలోకూడా అనుకొనివుండవు.

కోమ: [తాంబూలం వేసుకుంటూ] ఎందుకు అనుకోలేదూ? నా కెప్పుడో తెలుసు యిలా జరుగుతుందని. అసలు మీ బుద్ధే అల్పవిషయాల మీదికి పోతుంది. మీ చారే అంత! గొప్పవాళ్ళతో వియ్యమందడం మీకు అలవాటుంటేగా? ఇహ నేనా? గొప్ప యింటి ఆడపడుచును. నాబుద్ధి ఎప్పుడూ గొప్పవాళ్ళపై పే మళ్లుతుంది.

చైనులు: కోమలీ! ఇప్పుడు మనం వెనుకటి మనుషులం కాము. మన అంతస్థు పెరిగింది. ఇహ మనం నేలమీద నడవము. ఆకాశంలో విహరిస్తాం. నామీద కంప్లయింట్లుచేశారే వెధవలు, వాళ్ళ నిప్పు డేంచేస్తానో చూడు! హిజ్ ఎక్సెలన్సీ ఇన్‌స్పెక్టర్ జనరల్, చైనులుగారి అల్లుడు కాబోతున్నాడని ఊరంతా చాటించమన్నాను. జవాన్లను పంపాను. కాన్‌స్టేబుల్సుతో చెప్పాను. అందరు వినేలా నడివీధిలో నిలబడి కేకలు పెట్టమన్నాను. ముఖ్యంగా ఆ భూషయ్య, శేషయ్య. ఈ వార్త వింటే వాళ్ళ నోళ్ళల్లో బండపడుతుంది. నా కూతుర్ని యే పల్లెటూరి మొద్దుకో కట్టబెడతా ననుకున్నారు. ఇడియట్స్! ఢిల్లీలో ఒక మహారాజు, ఒక మేధావి, బ్రహ్మిని తిమ్మిని, తిమ్మిని బ్రహ్మిని చేసి ప్రపంచాన్నే మార్చగల మహానుభావుడు నా

కూతుర్ని పెళ్ళాడబోతున్నాడని తెలీగానే ఒక్కొక్కడికి గుండెలు తారెత్తుతాయి! నా కాళ్లు పట్టుకోవడానికి పరుగెత్తు కుంటూ వస్తారు. ఇహ చూపిస్తా నా తడాఖా! చైనుల్ని చెవులుపట్టుక ఆడిద్దామనుకున్నారు కుంకలు! చైనులుతో వ్యవహారం నిప్పుతో చెలగాటం! ఒక్కొక్కణ్ణి సర్కస్ చేయిస్తాను. కోమలీ! మనం యీ ఊళ్ళో వుందామా, లేక ఢిల్లీకి కాపురం ఎత్తేద్దామా?

కోమ: [అతని ఉద్దేశ్యాన్ని సమర్థిస్తూ] ఈ పాడు ఊళ్లో ఎవరుంటారు? మనం ఢిల్లీలో కాపరం పెట్టాల్సిందే!

చైనులు: అవును ఢిల్లీ వెడదాం. ఈ ఊరంటే నా కిష్టమే. అయినా ఢిల్లీ వెడదాం. అప్పుడు నా ఉద్యోగంకాస్తా గంగలో కలుస్తుందే! పోతేపోనీ; వెధవ ఉద్యోగం. ఇన్‌స్పెక్టర్ జనరల్ మామగారిని. ఇహ నాకు ఉద్యోగాని కేం కొదువ? అతగాడే నన్నొక ఉన్నతపదవిలో పడేస్తాడు. కాలం కలిసివస్తే, నేను కూడా ఒక ఛీఫ్ కమాండర్‌నో, ఇన్‌స్పెక్టర్ జనరల్‌నో అయిపోతాను. ఏం కోమలీ! నేను ఇన్‌స్పెక్టర్ జనరల్ అయిపోనూ?

కోమ: ఎందుకు అయిపోరూ? ఏ క్షణాన అయినా అయిపోవడానికి వీలుంది.

చైనులు: వీలుకాదే పిచ్చిదానా! తప్పకుండా అయిపోతాను. ఇహ మనం కాలు కిందపెట్టం. ఈ డొక్కుల టాక్సీలో కాదు మన ప్రయాణం. విమానంలో! ముందు ఢిల్లీ వెడతాం. అక్కణ్ణుంచి విదేశాలకు పోతాం. ఇంగ్లాండు వెళ్ళి అక్కడ ఎలిజెబెత్ రాకుమారుడి భవనంలో అతిథులుగా వుంటాం.

కోమ: అయ్యో, ఖర్మ! ఎలిజెబెత్ రాణీ అండీ, రాకుమారుడంటారేం?

చైనులు: అవును. అక్కడ ఆర్డర్లు ప్యాస్‌చేయడమే నా పని. సంతకాలు పెట్టడానికూడా నాకు తీరిక, ఓపిక వుండదు.

మొహాన్ తయారుచేయిస్తాను. ఏం కోమలీ! ఇహనుంచి నీవు నాతో ఇంగ్లీషులో మాట్లాడాలి.

కోమ: అవును. ఇంగ్లీషంటే నాకెంతో ఇష్టం. కాని ఏం చేయను? నాకు బాగా రాదే?

చైనులు: నీ మొహం? బాగా ఏమిటి? అసలు రాను. ట్యూటర్‌ను ఏర్పాటుచేస్తాను. నేర్చుకో! మరో విషయం. నీవు ఇంగ్లీషు వాళ్ళ పద్ధతిలో డ్రెస్ చేసుకోవాలి.

కోమ: మరి మీరూ?

చైనులు: నేనుకూడా ఈ పాడుపంచెలు, చొక్కాలు వదిలేసి, మాంచి ఉలెన్ సూట్లు పట్టిస్తాను. మనం వెళ్లినచోటల్లా సన్మానాలు చేస్తారు. దండలువేసి స్వాగతపత్రాలు చదువుతారు. నీవు కాస్త స్వంతంగా ఉపన్యాసం ఇవ్వడం నేర్చుకోవాలి. ఇక్కడ ఈ వెధవక్లబ్బుల్లో మాట్లాడ్డం కాదు, నాచేత ఇంట్లో వ్రాయించుకపోయి. పార్టీలకూ, సభలకూ నిన్ను ఆహ్వానిస్తారు. పెద్ద పెద్ద దొరలు, దొరసానులు నీ పక్కన వుంటారు. నీవు ప్రైజులు పంచిపెట్టాలి.

కోమ: [సంతోషంతో] ఆ! ప్రైజులే!

చైనులు: ఇన్‌స్పెక్టర్ జనరల్ సతీమణి అంటే మరి ఏమనుకున్నావు? నిన్ను అప్పుడు ఏమని పిలుస్తారో తెలుసునా?

కోమ: [ఆదుర్దాగా] ఏమని పిలుస్తారండీ?

చైనులు: శ్రీమతి కోమలీ! మిసెస్ చైనులు! అని పిలుస్తారంతా. [వికృతంగా నవ్వుతాడు]

కోమ: [చెవులు మూసుకుని] అబ్బబ్బ! ఆపండి! మీరు నవ్వితే ఏడ్చినట్లుంటుంది! [a pause] నాకు మీరేం చెప్పక్కర్లేదు. మీరే గొప్పవాళ్ళతో తిరగడం అలవాటులేక తికమకలవుతారు. అప్పుడు మీతో తిరిగేవాళ్లు యీ ముష్టి పానకాలు, హయగ్రీవం, వీళ్లు కారు. గొప్ప గొప్ప ఆఫీసర్లు, మంత్రులు మీ

చుట్టూ వుంటారు. మీ అందవికారాలు చూస్తే నలుగురూ నవ్విపోతారు. నా పరువుకాస్తా ఎక్కడ తీస్తారో అని గుండెకు కూడుపట్టకుండా చస్తున్నా!

తిల : [అంతవరకూ తన్నెవరూ పలకరించకపోవడం చూచి] అయితే అమ్మా! నాకు పెళ్ళి అయింతరువాత ఏమవుతుందే!

కోమ : నీవు నోరుమూసుకోవే మొద్దూ! నీ కా గొడవలన్నీ అర్థంకావులే. మీ నాన్నగారూ, నేనూ ఉన్నాంగా! మేం అన్నీ చూచుకుంటాంలే.

తిల : అమ్మా! నన్నేకదే ఆయన పెళ్ళాడేదీ?

కోమ : ఇహ నోరుమూసుకోవే మొద్దూ! నిన్నుకాక నన్ను చేసుకుంటాడనుకున్నావా? అసలు నీ కీపెళ్ళి కావడానికి కారణ మెవరో తెలుసా? నేను! మీ అమ్మను. నా మొహం చూసే నిన్ను పెళ్ళాడతానన్నా డతను. అందుకని మీ అమ్మను మెచ్చుకోవాలే పిచ్చిదానా!

[వర్తకులు భూషయ్య, శేషయ్య భయపడుతూ ప్రవేశిస్తారు.]

భూష }
శేష } : అయ్యగారికి నమస్కారాలు!

చైనులు : [ధీమాగా కళ్ళు సవరించుకుంటాడు. మొదట్లో మెత్తగా మాట్లాడి ఆ తరువాత అగ్నిపర్వతంలా విరుచుకపడతాడు] ఓహో! మీరా? మిత్రులారా! వర్తక ప్రముఖులారా! రండి! కూర్చోండి! కులాసాగా ఉన్నారా? ఎలా వుంది మీ వ్యాపారం? ఇవాళ మంచి బేరం తగిలిందా? నా కెంతో ఆనందంగా వుంది. మీ కంటె నాకు ఆప్తు లెవరున్నారు? మరి నేనంటే మీ కిష్టంలేదు కదూ: [With Harsh voice] పచ్చి మోసంతో, కటికి అబద్ధంతో అడ్డమైనగడ్డి తిని బ్రతికే మీరు...మీరు నామీద ఫిర్యాదు చేస్తార్రా? నన్ను జైలుకు పంపిస్తారా? ఎంత

సాహసం! డొక్క చీలుస్తాను. మీ ఎముకలు ఏరుతాను. మీ పేగులు జంధ్యంగా వేసుకుంటాను!

కోమ: అబ్బ! ఏమి టాటిట్లు? మనుషులు మాట్లాడే భాషే నా అది?

చైనులు: కోమలీ! నీవు మాట్లాడక. [అతను కసురుకోగానే, కోమలమ్మ, తలకంచేచి లోపలికి వెడతారు. తర్వాత, చైనులు, వర్తకులతో] మీరు ఎవర్ని వేడుకున్నారో, ఆ ఇన్‌స్పెక్టర్ జనరల్ రేపీ పాటికి నాకు అల్లుడు కాబోతున్నాడు. ఒరేయ్, భూషయ్యా! నీకు వార్‌టైంలో కిరసనాయిలు కోటా ఇప్పించిందెవరు? అడివి కాంట్రాక్టు ఇప్పించిం దెవరు? అప్పుడే మరిచిపోయావా? బ్లాకు మార్కెట్టులో లక్ష రూపాయలు సంపాదించావే! దొంగ లెక్కలు సృష్టించి సేల్సుటాక్సు, ఇన్‌కమ్‌టాక్సు ఎగగొట్టావే! తప్పుడు కొలతలుకొలిచి, తప్పుడు తూకాలువేసి ప్రజల్ని మోసగించావే! నిన్ను జైలుకు పంపలేక నేనా ఊరుకున్నది? పది గజాలు పనికిమాలినగుడ్డ, నాలుగుమోపుల కట్టెపుల్లలు నాకిచ్చి దాంతో పెద్ద దానకర్ణుడవని బిరుదు సంపాయించా లనుకున్నావేం? ఒరేయ్, శేషయ్యా! నాదగ్గరట్రా నీ బండారం? మీ నాయన బుగ్గారెలమ్ముకుని బ్రతికాడు. నీవు మొన్నటి దాకా నీళ్ళకావళ్ళు మోశావు. నీ తమ్ముణ్ణి పిచ్చాణ్ణి చేశావు. వాడి ఆస్తి అంతా కాజేసి దేశాలమీద పంపావు. నీ అత్తను గొంతుపిసికి బావిలో తోశావు. దాని ఆస్తి అంతా కట్టుకున్నావు. ఇలా ఎందరినోళ్లో కొట్టి ఈనాటికి పెద్ద షావుకారు వయ్యావు. అవును. నేను లంచాలు పుచ్చుకున్నాను. మీరు, తినే తినే కంచాలు లాక్కున్నారు. ఎవరిదిరా అన్యాయం? ఇలాంటి నీచులు, పుండాకోర్లు, అందరూ సంఘాలుపెట్టి ఆఫీసరుతో నామీద రిపోర్టుచేస్తారా!

శేష: అయ్యగారూ! బుద్ధి గడ్డితిన్నది. మమ్మల్ని క్షమించండి.

భూష : చైనులుగారూ ! పొరపాటయింది. ఆ క్షణంలో మాకేదో దయ్యం పట్టింది. వళ్లు తెలీలేదు. జరిగిపోయింది. ఇప్పుడు మీ కాళ్లు పట్టుకుంటున్నాం. క్షమించమని వేడుకుంటున్నాం.

చైనులు : [వెటకారంగా] క్షమించమని వేడుకుంటున్నాం! అందితే జుట్టూ, అందకపోతే కాళ్ళూనా? గాడిదల్లారా!

శేష : తమరు ఆగ్రహిస్తే మేమెంతటి వాళ్ళం? ఈ ఊళ్ళో బ్రతగ్గలమూ చెప్పండి!

చైనులు : ఆబుద్ధి ఇంతకు ముందెక్కడికి పోయిందోయ్? ఇప్పుడు జుట్టు నా చేతుల్లోవుంది కదూ? అందుకని కాళ్ళు పట్టుకుంటున్నారా?

భూష : పిల్లలు కలవాళ్ళం మా కుటుంబాలు నాశనం చేయకండి! జరిగినదంతా మరిచిపోయి, మళ్ళీ మమ్మల్ని మీ స్నేహితులుగా చూచుకోండి.

చైనులు : ఈ క్షణంలో మిమ్మల్ని సర్వనాశనం చెయ్యగలను. మళ్ళీ పొట్టమీద కొట్టలేక వస్తాయిస్తున్నా!

శేష : చిత్తం. అదే మేమూ కోరేది.

చైనులు : కోపం మనసులో వుంచుకునేవాణ్ణికాదు. జాలిపేగుల వాణ్ణి. సరే. అయిందేదో అయిపోయింది. ఈ సారికి క్షమిస్తున్నాను. ఇకనైనా బుద్ధికలిగి వుండండి. ఇంకోసారి యిలాంటి పని చేశారా, తోలువలిపిస్తా! జాగ్రత్త!

భూష : చిత్తం. మళ్లీ చేస్తే చెప్పుతీసుక కొట్టండి.

చైనులు : మా అమ్మాయిపెళ్లికి ముహూర్తం పెట్టుకున్నాం. వ్యవధికూడా లేదు. ఎన్నో పనులు నెత్తిమీద వున్నాయి.

భూష : ఏమి కావాలో చెప్పండి. సప్లయిలు చేస్తాం.

శేష : నాదగ్గర తాటాకు సమృద్ధిగావుంది. పంపించమంటారా?

చైనులు : అవును. ఇంటిముందు పందిరి వెయ్యాలి. పది బండ్లు తోలించి పడెయ్యి.

శేష : తక్షణం తోలిస్తాను.

చైనులు : ఒకటోరకం బియ్యం పదిబస్తాలైనా కావాలి. ఊరబంతి పెట్టాలనుకుంటున్నా.

భూష : గుడివాడ రామసాగరాలు, సన్నాలు, నెంబర్లు వున్నాయి. ఎన్ని బస్తాలు కావాలో తీసుకోండి.

చైనులు : శేషయ్యా! నీవు ముందుగా విచారించి మంచి నెయ్యి పది డబ్బాలు పట్టించి మా ఇంటికి పంపు.

శేష : చిత్తం. ఇంతకూ లగ్నం ఎప్పు డన్నారు?

చైనులు : వచ్చే శనివారం రాత్రి 12 గంటలకు. వృశ్చిక లగ్నం.

భూష : ఈ నాలుగురోజులు మేము మీ కళ్ళఎదుటే పడివుంటాం; కావల్సిన పనులన్నీ చేసిపెడతాం.

చైనులు : సరే. ఇహ వెళ్ళండి. సాయంత్రం ఒకసారి కనపడండి.

భూష : చిత్తం. సెలవు. జరిగినదంతా మరిచిపోండి.

శేష : చిత్తం. సెలవు. నిన్నటి విషయం మనసులో పెట్టుకోకండి.

చైనులు : సరే, వెళ్ళండి. [భూషయ్య, శేషయ్య వెళ్ళిపోతారు]

[కోమలమ్మ, తిలకం ఇంట్లోంచి వస్తారు. ఇటు పానకాలు, కైలాసరావు ప్రవేశిస్తారు]

పానకాలు : చైనులుగారూ! మేము విన్నది నిజమేనా? క్షణంలో అదృష్టదేవత మిమ్మల్ని వరించినమాట సత్యమేనా?

కైలాస : చైనులుగారూ! ఇంతలోనే మీకు అదృష్టం పట్టిందని వినగానే సంతోషంతో పొంగిపోయాను. ఈ శుభసమయంలో మీకు నా హృదయపూర్వక అభివందనాలు తెల్పడానికి వచ్చాను.

[మిరియాలు, ధనియాలు పరుగెత్తుకుంటూ వస్తారు]

మిరి : గురువుగారికి నా వందనాలు. ఈవార్త వినగానే అన్నం తినేవాణ్ణి లేచివచ్చాను.

ధని : గురువుగారికి నా వందనాలు. ఈవార్త వినగానే నీళ్ళు పోసుకునేవాణ్ణి తుడుచుకోకుండానే వచ్చేశాను.

మిరి : కోమలమ్మగారూ! మీరు లక్షవత్తుల నోము నోచుకున్నా రమ్మా!

ధని : కోమలమ్మగారూ! భాగ్యమంటే మీదేనమ్మా. తిలకమ్మా! నీవు శ్రీ మహాలక్ష్మివమ్మా! ఇహ నీ వళ్ళంతా బంగారమే! నీ ఇల్లంతా సింగారమే! [ఇద్దరూ ఒకరి నొకరు తోసుకుంటూ ఆమెను అభినందిస్తుంటారు]

మిరి : తిలకమ్మా! నీవు తొందరలోనే గుమ్మడిపండులాంటి కొడుకును యెత్తుకుంటావు. నీ కొడుకు కాగిచిప్పల్లాంటి కళ్ళు, బుగ్గారెల్లాంటి బుగ్గలు కలిగి శ్రీ మహావిష్ణువులా వుంటాడు – ఎత్తుకోమని 'కావ్ కావ్' అంటూ ఏడుస్తాడు. [అభినయిస్తాడు] వాళ్ళ నాయనలాగే కవిత్వం రాస్తాడు; ఆఫీసరవుతాడు.

[హాయగ్రీవం ఆదుర్దాగా ప్రవేశిస్తాడు]

హాయ : నమస్కారం. అంతటి మహానుభావుడు మీకు అల్లుడు కాబోతున్నాడని విని ఆనందబాష్పాలు రాల్చాను.

చైనులు : మిత్రులారా! మీ అభిమానానికి నా కృతజ్ఞత తెల్పుతున్నాను. అంతా కూచోండి.

పానకాలు : చైనులుగారూ! అసలు ఇదెలా సంభవించింది? హిజ్ ఎక్సెలెన్సీ, మీ అమ్మాయిని వివాహం చేసుకుంటానని ఎలా ఒప్పుకున్నారు? జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పండి.

కోమ : అదంతా దైవనిర్ణయం. క్షణంలో జరిగిపోయింది. ఆఫీసరుగారు గొప్ప ఆదర్శాలు కలవారు. ఉన్నతభావాలు ఆయనలో మూర్తీభవించివున్నాయి. 'కోమలమ్మగారూ! నాకు జీవితము మీద రోతపుట్టింది. కాని, మీ గుణగణాలు నన్ను మార్చివేశాయి. మీ అమ్మాయిని పెళ్ళాడ దలచాను' అంటూ ఆయన ప్రాధేయపడ్డాడు.

తిల : అమ్మా! అమ్మా! నిన్ను కాదే అలా చేసింది, నన్ను!

కోమ : [కూతురుతో] నీవు నోరుమూసుకోవే మొద్దూ! ఆయన ఏంచేసేందీ నీకర్థమై ఏడ్చింది ? [వచ్చినవాళ్ళతో] 'మీరు పిల్లనివ్వడానికి నిరాకరిస్తే పిస్తోలుతో కాల్చుకుంటాను' అన్నాడాయన.

చైనులు : ఆయన పిస్తోలుతో కాల్చుకుంటాననేసరికి నాకు పై ప్రాణం పైననే పోయింది.

హాయ : ఆఁ! తరువాత ?

చైనులు : తరువాత ఏముంది ? సంతోషంగా అంగీకరించాం.

పానకాలు : హిజ్ ఎక్సెలెన్సీ ఎక్కడికి వెళ్ళారు ? వారి దర్శనం చేసుకుందామని కుతూహలపడుతున్నాం.

చైనులు : అతి ముఖ్యమైన పనిమీద ఊరికి వెళ్ళారు.

కోమ : వారి మేనమామగారితో ఈ విషయం చెప్పి ఆయన ఆశీస్సులు తీసుకోడానికి వెళ్ళారు.

చైనులు : అవును. రేపొస్తానన్నారు.

కోమ : మేము ఢిల్లీ వెడదామనుకుంటున్నాం. ఈ ఊళ్ళో మాకేం బాగాలేదు. మావారికి అక్కడ ఇన్ స్పెక్టర్ జనరల్ ఉద్యోగం అవుతుంది.

చైనులు : అవును. నేను ఇన్ స్పెక్టర్ జనరల్‌గా వెళ్ళిపోదామనుకుంటున్నా.

పానకాలు : [వ్యంగ్యంగా] అవును. పెద్ద ఆకలి కలవాళ్ళకు పెద్ద విస్తరే కావాలి.

కైలాస : సమర్థులకు అన్నీ సమకూడుతాయి. అయితే చైనులుగారూ! ఇహ మమ్మల్ని మరిచిపోతారన్నమాట. ఢిల్లీలో గొప్ప పదవిలో వుంటారాయె! ఇహ ఈ పాతస్నేహితులు మీకు గుర్తుకొస్తారా ?

పానకాలు : ఏమండీ, చైనులుగారూ! మా కెప్పుడైనా ఆఫీసు వ్యవహారాల్లో చిక్కులొస్తాయనుకోండి. మీరు రాజధానిలో

వుంటారాయె? మా కేమైనా సహాయంచేసి ఆపదలకు అడ్డు పడతారా?

కైలాస: మా పెద్దబ్బాయిని మీతో పంపుదా మనుకుంటున్నాను. వాడి కేదైనా అక్కడ ఉద్యోగం చూసిపెడతారా?

చైనులు: నా చేతనైన సహాయం తప్పకచేస్తాను.

కోమ: [భర్తతో] మీ రెప్పుడూ ఇంతే. చాతా వాతా కాక పోయినా, అందరికీ ముందుగా వాగ్దానాలుమాత్రం చేస్తుంటారు. మీ రివన్నీ పట్టించుకోవడానికి తీరి కెక్కడ వుంటుంది?

చైనులు: ఫరవాలేనులేవే! అలాగే తీరికచేసుకోవాలి. మనవాళ్ళను ఆమాత్రం కనిపెట్టి వుండొద్దూ?

కోమ: [కోపంగా] ఎందుకు వుండొద్దూ? మీ ఇష్టంవచ్చినట్లే చేసు కోండి. నా కేం పట్టింది మధ్య?

[కోమలమ్మ విసురుగా లోపలికెడుతుంది. తిలకంకూడా తల్లిని అనుసరిస్తుంది.]

పానకాలు: ఆమెగారికి మనమంటే ఎప్పుడిష్టంవుంది కనుక, ఇప్పు డుండడానికి?

కైలాసం: అసలు ఆవిడ స్వభావమే అంత.

[పోస్టుమాస్టరు కాంతయ్య గబగబ ప్రవేశిస్తాడు. అతని చేతిలో ఉత్తరం ఉంటుంది. ఉత్తరం ఊపుతుంటూ వస్తాడు.]

కాంత: అతి భయంకరమైన సంఘటన జరిగింది!

చైనులు: [ధీమాగా] ఏమిటో చెప్పవయ్యా! వింటూనే వున్నాం.

కాంత: అదేమిటో నేను చెప్పలేను. ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తోచకుండా వుంది. ఇలా జరుగుతుందని మనం కలలోకూడా వూహించి వుండం.

పానకాలు: అసలు సంగతేమిటో చెప్పండి!

కాంత: [అందరివేపూ చూచి, గట్టిగా వూపిరి పీలుస్తాడు. గొంతు సవరించు కుంటాడు] పోస్టాఫీసులో పని పూర్తిచేసుకుని ఇంటికి పోవాలని బయలుదేరా. అదే సమయానికి మన ఆఫీసరున్నాడే, ఆయన

వ్రాసిన ఉత్తరం ఒకటి పోస్టాఫీసుకు వచ్చింది. ఆ ఉత్తరంమీద అడ్రెస్సు 'మిస్టర్ టి. ప్రభాకర్, C/o Director of Postal Services, Delhi' అని వుంది. అది చూచేసరికి నా గుండె గుభేలుమంది. నా మీద రిపోర్టువ్రాసి పంపుతున్నాడని భయపడ్డాను. అసలు అప్పుడప్పుడు ఉత్తరాలు చింపడం నా కలవాటేగా! ఇంకేం? ఈ వుత్తరంకూడా ఏమిటో చించి చూడాలని బుద్ధిపుట్టింది.

పానకాలు: ఏమిటీ! ఆఫీసరు స్వంత ఉత్తరమా?

[లోపల్నుంచి కోమలమ్మ, తిలకం ప్రవేశిస్తారు. ఆదుర్దాగా వింటుంటారు.]

చైనులు: అంటే నీవు చెప్పేది........[మాట్లాళ్ళేకు]

కాంత: [వేగంగా] ఆ కవరు చింపడానికి మొదట నాకు భయం వేసింది. పోస్టు Bag లో కట్టి మెయిలుబండిలో పంపిద్దామని రెండడుగులు ముందుకు వేశాను. కాని అంతలో నాలో ఏదో శక్తి నన్ను వెనక్కు లాగింది. 'ఆ ఉత్తరం తెరువు' అని అంతర్వాణి పలికింది. వెంటనే 'తెరవకు' అని కర్ణపిశాచిలాంటిది నా చెవిదగ్గర పలికింది. అంతలో మళ్ళీ నాలో అంతర్వాణి 'తెరువు, తెరిచి చూడు' అని అరిచింది. తిరిగీ చెవిదగ్గర 'ఉత్తరం తెరవకు; తెరిచావా నీవు నాశనమైపోతావు. జాగ్రత్త!' అని కర్ణపిశాచి. మళ్ళీ అంతర్వాణి 'మూర్ఖుడా! సందేహించకు, వెంటనే తెరిచి చూడు' అంటూ వాక్కులు పలికాయి. అలా నా మనస్సు రెండువైపులా గిజగిజ తన్నుకుంది. నా చేతుల్ని యేదో అయస్కాంతం లాగుతున్నట్లు అనిపించింది. పది నిముషాలు ఏం చేయడానికీ పాలుపోక నిశ్చేష్టుడనై నిలబడ్డాను. ఆఖరుకు ధైర్యం తెచ్చుకుని ఉత్తరం చింపిచూచాను.

చైనులు: ఎంత సాహసం? హిజ్ ఎక్సెలెన్సీ పర్సనల్ లెటర్ చించి చూచావా!

కాంత : ఏం చేయమంటారు ? చింపి చూచాను. నా జీవితంలో ఎప్పుడూ అంత భయం పుట్టలేదు. కిటికీలన్నీ మూసుకున్నాను. ఆఫీసు తలుపులు లోపల గడియపెట్టి తాళం వేశాను. తలుపు కన్నాలుకూడా కన్పించకుండా కాగితాలు అంటించాను. కవరు చింపుతోంటే నా నరాలు తెగిపోతున్నట్లనిపించింది. ఎలెక్ట్రిక్ షాక్ కొట్టినట్లయింది. తల తిరిగిపోయింది. వళ్ళంతా చెమటలు. నే నెక్కడున్నదీ తెలీలేదు, పళ్ళు గట్టిగా కరుచుకపోయాయి. ఆ విధంగా గంటసేపున్నాను. కాని ఉత్తరంలో ఒక పంక్తి కూడా చదవలేకపోయాను.

చైనులు : అంత గొప్పవాడి ఉత్తరం చించడానికి నీకు ఎన్ని గుండె లొచ్చాయి ?

కాంత : అదే అసలు సంగతి ! అతను గొప్పవాడు కాదు, మనం అను కున్న ఆఫీసరు కాదు. అసలతను ఇన్‌స్పెక్టర్ జనరల్ కానేకాదు.

చైనులు : [మిగతావాళ్ళేదో అనబోతోంటే, వాళ్ళను మాట్లాడనీయకుండా ఆపుతాడు] పెద్ద తెలిసినవాడిలా మాట్లాడుతున్నావు. అయితే అతను ఎవరంటావు ?

కాంత : ఎవడో దోవనిపోయే పిచ్చి పుల్లాయ !

చైనులు : ఏమిటి నీ వనేది ? పిచ్చివాగుడు వాగుతున్నావు. నిన్ను అరెస్టు చేస్తున్నాను.

కాంత : ఎవరు ? మీరా ?

చైనులు : అవును. నేనే.

కాంత : మీరు కాదు. మీ తాతకూడా ఆపని చేయలేడు.

చైనులు : అతను మా అమ్మాయిని పెళ్లాడబోతున్నాడు తెలుసా ? ఏమనుకుంటున్నావో ! నిన్ను జైలుకు పంపిస్తాను.

కాంత : [పరిహాసంగా నవ్వి] జైలు ! అదొక్కటే తెలుసు మీకు ! కాని ఈ వుత్తరంచదివి వినిపిస్తే అసలుసంగతి మీకే తెలుస్తుంది. చదవమంటారా !

అందరూ: చదవండి! చదవండి!

కాంత: [చేతిలో ఉత్తరంతీసి చదువుతాడు] "డియర్ ప్రభాకర్! నా ప్రయాణంలో ఇటీవల చేసిన సాహసకృత్యాలు నీకు క్లుప్తంగా తెలపాలనుకుంటున్నా. పేకాటలో ఒక భటాచోరు నా డబ్బంతా కొట్టేశాడని నీ కిదివరకే వ్రాశాను. ఆ తరువాత ఈ ఊరికొచ్చాను. చేతిలో దమ్మిడీలేకుండా హోటల్లో దిగాను. అన్నీ అప్పులే. హోటలువాడు నన్ను పోలీసులకు పట్టించాలని చూచాడు. మా నాన్నగారు చిల్లిగవ్వకూడా పంపనని ఇదివరకే తెలియజేశాడు. ఇంతలో ఒక తమాషా జరిగింది. గమ్మత్తయిన కథ! మనం ఢిల్లీలో వెలగబెట్టినవాళ్ళంకదోయ్! నా వాలకం చూచి ఈ వూళ్ళోవాళ్ళంతా, నేను రాజధానినుంచి వచ్చిన ఒక పెద్ద ఆఫీసరునని భావించారు. నే నిప్పుడు ఈ ఊరి పెద్ద ఉద్యోగి చైనులు ఇంట్లో మకాంపెట్టాను. నీకు జ్ఞాపకముందా? ఒకసారి మనిద్దరం చేతిలో దమ్మిడీలేక అవస్థపడుతోంటే, ఆ హోటలువాడు మనల్ని మెడపట్టి గెంటాడు. ఇప్పుడలా కాదు. అందరూ వందలొందలు తెచ్చి నా చేతికి అందిస్తున్నారు. అయితే అప్పుగానే అనుకో! చాల గమ్మత్తుగావుందిలే. నీవు చూచినట్లయితే నవ్వలేక పొట్టఉబ్బి చచ్చేవాడివి. ఈ ఊరి అధికారి చైనులు ముందు నావల్లో పడ్డాడు. నేను బ్రహ్మాండమైన నాటకం ఆడేశాను. నాకు అతను గొప్పగా ఆతిథ్యంఇచ్చి సత్కరిస్తున్నాడు. కాని, పాపం ఆ వృద్ధుడికి బుద్ధి పూర్తిగా మందగించింది. 'బుద్ధిలేని ముసలి గాడిద!'

చైనులు: అబద్ధం! అందులో అలా లేదు. నీ ఇష్టంవచ్చినట్లు చదువుతున్నావు.

కాంత: అయితే మీరే చదువుకోండి.

చైనులు: నేను బుద్ధిలేని ముసలి గాడిదనా! అసంభవం! అది నీ స్వంత కవిత్వం. నీవే ఆ మాట రాసివుంటావు.

కాంత : నేనా ? నే నిలాంటి ఉత్తరం ఎందుకు రాస్తాను ?

పానకాలు : తరువాత చదవండి. తరువాత చదవండి !

చైనులు : నీ దుంప తెగ. అదేమాట పదేపదే అంటావేమయ్యా ? రెండుసార్లు అన్నావుగా, సరిపోదూ !

కాంత : [చదువుతూ] ఆ చైనులు బుద్ధిలేని ముసలిగాడిద.

కాంత : [చదువుతూ] 'ఆ చైనులు బుద్ధిలేని ముసలి గాడిద' పోస్టు మాస్టరున్నాడు చూచావ్ ? చాల మంచివాడు. అతను ...... [చదవడం ఆపి] నన్ను గురించి ఏదో కాస్త తిట్టాడులెండి.

చైనులు : [ఆసక్తితో] చదువు చదువు ! నిన్ను గురించి ఏం తిట్టాడో చదువు.

కాంత : అది మీ కెందుకూ ? అది నేను చదవను.

కైలాసం : ఆ ఉత్తరం నా కివ్వండి. [ఉత్తరం లాక్కుని తను చదువుతాడు] పోస్టుమాస్టరు, మన హోటలు సర్వరు సర్వారాయుడిలా దగ్గరి కొస్తే మదపు కంపు కొడుతుంది.

కాంత : పోకిరీ వెధవ !

కైలాస : [మళ్ళీ చదువుతూ] ఇహ డాక్టరు........... [చదవడానికి సందేహిస్తాడు.]

హాయ : [ఆసక్తితో] ఏమిటది ? ఏమిటది ?

కైలాస : ఇక్కడ సరిగా తెలీడంలేదయ్యా ! జిలుగు జిలుగ్గా వుంది.

హాయ : ఇలా ఇవ్వండి. నేను చదువుతాను. మీకు చత్వారం, సరిగానే కన్పించదు.

కైలాస : అక్కర్లేదు. నేను బాగానే చదువుతాను.

హాయ : అవును లెండి. మీసంగతి నాకు తెలుసు. నా కివ్వండి.

కైలాస : అక్కర్లేదు. ఇప్పుడు బాగానే కన్పిస్తోంది.

కాంత : [కైలాసరావుతో] అలా వీల్లేదు. అయ్యవార్లంగారి కివ్వండి. నీవు నీ విషయం వచ్చేసరికి, అందులో విషయం వదిలేసి చదువు తున్నావు. [ఉత్తరం బలవంతాన లాక్కుని హయగ్రీవాని కిస్తాడు]

హాయ : [ఉత్తరం చదువుతూ] డాక్టరు, సరీగా గుడ్లగూబలా వుంటాడు.

కైలాస : అదేమంత పట్టించుకోదగింది కాదు. ఆఫ్టర్ ఆల్ గుడ్లగూబ!

హాయ : ఇహ హెడ్మాస్టరు......[చదవడం ఆపి] ఇక్కడేదో రాసి కొట్టేశాడండీ!

పానకాలు : అలా కాదు. నా కివ్వండి. [ఉత్తరం లాక్కొని చదువుతాడు] హెడ్మాస్టరు మొహం అచ్చం గుర్రపుతలకాయలా వుంటుంది. [అంతా నవ్వుతారు]

హాయ : అవును. మా తండ్రిగారు అశ్వపూజ చేశారు. నాకూ గుర్రాలంటే ఇష్టం. [గుర్రంలా సకిలిస్తాడు]

పానకాలు : పోనీలే. నేను బ్రతికిపోయాను. నన్నేమీ రిమార్కు చేయలేదు.

కాంత : ముందున్నది ముసళ్ళపండగ! తరువాత చదవండి.

పానకాలు : [ఉత్తరంలో తన విషయం ఉన్నదని గ్రహించి, విసుగ్గా] ఇంత పెద్ద ఉత్తరం ఎవడు చదువుతాడయ్యా? ఇదసలు మనుష్యమాత్రు లెవరూ రాసివుండరు. ఏ దయ్యమో, భూతమో రాసినట్లుగావుంది.

కాంత : కాదు. ఇలా ఇవ్వండి. [ఉత్తరం తీసుకుని చదువుతాడు] పోతే మాజిస్ట్రేటు పట్టిసాక్కెండ్రెల్!

పానకాలు : ఫరవాలేదు. అదేదో ఇంగ్లీషులో తిట్టాడు. దాని అర్థం లోతుగా విచారిస్తే మంచిమాటే అయివుంటుంది.

కాంత : ఉండండి, ఉండండి! అప్పుడే కాలేదు. [మళ్ళీ చదువుతాడు] ముండలముఠాకోరుకూడా. [పానకాలు మొహం మాడ్చుకుంటాడు] పోతే, వీళ్ళంతా లంచాలు ఇచ్చుకోవడంలోను, లంచాలు పుచ్చుకోవడంలోను ఆరితేరిన ఘటాలు! మరోవిషయం ఏమిటంటే, ఈఉద్యోగస్థుల్లో ఒకరికీ మరొకరికీ సరిపడదు. అస్తమానం వాడిమీద వీడూ, వీడిమీద వాడూ కంప్లయింట్సు చేసుకుంటూ

తన్నుక చస్తుంటారు. [అందరూ ఒకరి మొహాలు ఒకరు చూచుకుంటారు]
అదిరా విషయం! లైఫ్ చాల డల్‌గావుంది బ్రదర్! కాస్త
మెదడుకు మేతవుండాలి. ఇదంతా ఒక కథగానో, నాటకంగానో
రాసుకో. వీళ్ళందరికీ మస్కాకొట్టి ఇవాళే ఇక్కణ్ణుంచి ఉడా
యిస్తున్నా! వెంటనే మా ఊరికి రిప్లయి వ్రాయి.

ఇట్లు,
వ సం త కు మా ర్"

కోమ: ఏమి టీ పిడుగువార్త?

చైనులు: ఏముంది? ఖూనీ! నన్ను పట్టపగలే ఖూనీ చేశాడు. కళ్ళల్లో కారంచల్లిపోయాడు గాడిదకొడుకు! ఆ వెధవను వెంటనే వెదికి పట్టుకోండి, వెదికి పట్టుకోండి!

పానకాలు: ఏమి టీ అవాంతరం?

హాయ: తలవని తలంపుగా ముంచుకొచ్చిందే!

కైలాస: చాల చిత్రంగావుందే?

పానకాలు: మై గాడ్! నేను వాడికి నాలుగువంద లిచ్చాను.

హాయ: రామానుజ! నా దగ్గరా కాజేశాడు నాలుగువందలు!

మిరి: నాదగ్గర, ధనియాలుదగ్గర 65 రూపాయలు కొట్టేశాడు.

కైలాస: ఎలాగైతేనేం, మనం పప్పులో కాలువేశాం.

చైనులు: [తలపట్టుకుని] నేను! నేనే వట్టి దద్దమ్మనైపోయాను. పాతి కేండ్లబట్టీ గవర్నమెంటు ఉద్యోగం వెలగబెడుతున్నా. ఇలాంటి దెబ్బ ఎన్నడూ తినలేదు. ఇంతివరకూ ఎవరిచేతికీ చిక్కలేదు. కొమ్ములు తిరిగిన షావుకార్లతో బేరాలాడాను. కంట్రాక్టర్లతో చేతులు కలిపాను. అందర్నీ ఆట ఆడించాను. ముగ్గురు ఆఫీసర్లను బుట్టలో పెట్టాను. చివరకు ఈ వెధవ కుర్రకుంక చేతుల్లో ఖూనీ అయిపొయ్యాను.

కోమ: అదికాదండీ! మనమ్మాయిని పెళ్ళి చేసుకుంటానన్నాడుగా?

చైనులు : [ఒక్కసారిగా Burst అయిపోయి] పెళ్ళి! పెళ్ళి! చేశాడుగా పెళ్ళి! చూడండి! అందరూ చూడండి! చివరకు నా కెలాంటి దుర్గతి పట్టిందో! [తన్ను తాను అడ్రెస్ చేసుకుంటూ] ఓ చైనులూ! ఓ చవటచైనులూ! ఓ చేతగాని చైనులూ! ఓ బుద్ధిలేని చైనులూ! ఏమైనాయి నీ తెలివి తేటలన్నీ? ఏమైంది నీవు చదివిన చదువంతా? వేలెడంతలేని ఆ లోఫరు వెధవను చూచి ఆఫీసరని ఎలా అనుకున్నావు? చైనులూ! ఏమైంది నీ బుద్ధిపాటవం? నీ తెలివి తగలబడిపోయిందేం? bank లో కొత్తనోట్లు తెచ్చి వాడి మొహాన పోశావు. బండ్లో పరువూ, మెత్తని దిండ్లూ వేయించి చేతులారా సాగనంపావు. ఈపాటికి పరుగుతీసి ఏ ఊరో చేరి వుంటాడు. పైగా వీడొక కవిగా వున్నాడు. నా కథంతా ఒక నాటకంరాసి ఊరూరా ఆడిస్తాడు. అప్పుడు నా పరువూ ప్రతిష్ఠ, పేరూ ప్రఖ్యాతి అన్నీ ఏమైపోతాయి? నా అనుభవాన్ని, నా తెలివి తేటల్ని ఎవరు గమనిస్తారు? చైనుల్ని పిచ్చివాడికింద జమకడతారు. అందరూ నన్ను చూచి నవ్వుతారు. కథలు చెప్పుకుని ఆనందిస్తారు. [ప్రేక్షకులవైపు తిరిగి] ఎందుకు నవ్వుతున్నారు మీరంతా? మిమ్మల్ని చూచి మీరే నవ్వుకుంటున్నారు. నా కథ రాసి బట్టబయలు చేసే వెధవలందర్నీ తొక్కిపారేస్తాను. చైనులింకా చావలేదు. బతికేవున్నాడు, భగవంతుడొక మానవుణ్ణి శిక్షించబోయేముందు పరీక్ష చేస్తాడు. అలాగే నాకీ పరీక్ష జరిగింది. కాని ముందు నాకో విషయం చెప్పండి. వీడే ఇన్ స్పెక్టర్ జనరల్ అనీ, రాజధానినుంచి వచ్చిన ఆఫీసరనే విషయం నా మెదడులో మొట్టమొదట ఎలా ప్రవేశించింది? వాడు ఇన్ స్పెక్టరులా వున్నాడా? కాని ఊళ్ళో వెధవలంతా ఇన్ స్పెక్టర్, ఇన్ స్పెక్టర్ అని రొదపెట్టారు. అదుగో ఇన్ స్పెక్టర్! ఇదుగో ఇన్ స్పెక్టర్! అన్నారు. అతనే ఇన్ స్పెక్టర్ జనరల్ అని మొదట నాతో చెప్పింది ఎవరు? ఎవరు? ఎవరు? చెప్పండి! చెప్పండి!

మాట్లాడ రేం ? [మిరియాలు, ధనియాలు భయంతో ఒకరినొకరు చూచు కుని మెల్లగా జారుకోడానికి యత్నిస్తారు]

కైలాస : నాకు జ్ఞాపకం లేదు.

హాయ : [ఆలోచిస్తూ] ఏదో ఉత్తరం......

పానకాలు : అవును. ఆ ఉదయాన్నే మమ్మల్ని మీరు పిలిపించారు కూడా !

చైనులు : అది కాదయ్యా ? అతనే ఇన్‌స్పెక్టర్ జనరల్ అని అసలు ఎవరు చెప్పారని అడుగుతున్నా ?

పానకాలు : ఆ ! ఇప్పుడు జ్ఞాపక మొచ్చింది. వీళ్లే ! ఈ వెధవలే ! [మిరియాలును, ధనియాలును చూపిస్తాడు]

మిరి : నేను కాను బాబోయ్ !

ధని : నే నసలే కాదండోయ్ !

కైలాస : కాదు. మీరే !

హాయ : అవును. వీళ్ళే ! హోటల్లోంచి పిచ్చాళ్ళలా పరుగెత్తు కుంటూ వచ్చారు. 'ఇన్‌స్పెక్ట రొచ్చాడు; ఎవడికీ డబ్బివ్వడం లేదు' అంటూ వాగడం మొదలెట్టారు.

చైనులు : అవును. వీళ్లే ! ఊళ్ళో నారదులు ! వెధవవార్తలు పుట్టించి ఊరంతా ఒక కొలిక్కి తెస్తుంటారు. మీరూ, మీ ఇన్‌స్పెక్టర్ జనరలూ వెళ్ళి ఆ కిష్టలో పడి చావండి !

హాయ : అబద్ధాలుచెప్పే వెధవలు !

చైనులు : తాగుబోతులు ! సోమరిపోతులు !

[మిరియాలు, ధనియాలు ఒకరినొకరు కావలించుకుంటారు]

పానకాలు : తప్పుడు వెధవలు ! పుండాకోర్లు !

కైలాస : తిరుగుబోతులు !

కాంత : బుద్ధిలేని గాడిదలు !

కోమ : తిండిబోతులు ! పీపాలు !

మిరి : బాబోయ్ ! నేను కాదండీ ! ధనియాలు ! వాడే అదంతా చెప్పాడు.

ధని : నేను కానేకాదు. వీడే! మిరియాలు! నీవు కదరా నాతో చెప్పింది? నీ పొట్ట పగల!

[ప్రేక్షకుల్లోంచి బిళ్ళబంట్రోతు ప్రవేశిస్తాడు]

బంట్రోతు : ఈ ఊరి అధికారి చైనులుగారిల్లు ఇదేనా?

పానకాలు : [భయంతో] ఆ! ఇదే, ఇదే!

బంట్రోతు : రాజధానీ నగరంనుంచి ప్రభుత్వంచే ప్రత్యేకంగా నియమింపబడిన హిజ్ ఎక్సెలెన్సీ ఇన్ స్పెక్టర్ జనరల్ ఈ ఊరికి వచ్చి ట్రావెలర్సు బంగళాలో వేంచేసివున్నారు. మిమ్మల్ని తక్షణం హాజరు కమ్మన్నారు!

చైనులు కుప్పగా కూలిపోతాడు. భార్య, కూతురు, అతన్ని పట్టుకుని వుంటారు. పానకాలు చేతిలోవున్న కర్ర కిందపడిపోతుంది; హాయగ్రీవం నోరుతెరిచి రొప్పుతుంటాడు. కైలాసరావుకు నిలువుగుడ్లు పడి వుంటాయి. మిరియాలు, ధనియాలు గడగడ వణుకుతుంటారు; ఇలా అందరూ భయభ్రాంతులై ఒక్కొక్కరు ఒక్కొక్క భంగిమలో వుండగా

[ మెల్లగా తెర జారుతుంది ]

[ సమాప్తం ]



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | NPA01A361 | Date | 30/03/23 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 109 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | chaay | Cutting By | chaay |
| Scanned By | Annette | Pages | 113 |
| Quality Checking | prathyusha | | |